# వరమాల

శ్రీ గోవింద వల్లభపంతు

విరచితము

శ్రీ మాడభూషి సురేంద్రాచార్యులు

హిందీభాషనుండి తెనిగించినది

ప్రకాశకులు

అద్దేపల్లి లక్ష్మణస్వామి నాయుడు

సరస్వతీ గ్రంథమండలి

రాజమహేంద్రవరము

1927



వెల 1—0—0

మాననీయులైన యస్మజ్జనకునికి

సాదరానురాగములతో సమర్పించుచున్నాను.



# పీ ఠి క

ఈనాటకకథ పురాణమూలకము. మార్కండేయపురాణాంత ర్గతమైన కథాలేశమును స్వీకరించి ఆదిమ గ్రంథకర్త యితివృత్తము ను గైకొని రూపకము రచించినాడు. ఇందు ప్రేమపరీక్షతత్పరిణా మము చమత్కారప్రదముగను హృదయంగములుగను నిరూపింపబడి మన స్తత్వము సూక్ష్మదృష్టితో విశదీకృతమైనది.

హిందీ భాషానాటక శ్రేణిలో నీ వరమాల యుత్తమస్థానము నలంకరించుచున్నది. గోవింద వల్లభపంతు గ్రంథకారుడే కాక నటుడు కూడ నగుటచే నాట్యారంగోపయుక్తముగ నుండునట్లీ నాట కమును సృజించినాడు. కథావిధానమునం దేమి పాత్రపోషణమునం దేమి వాగ్వైచిత్రియమం దేమి యీ రూపకము నవీనత్వముతో విల సిల్లుచున్నది.

ఇదివరలో వంగమహారాష్ట్రభాషలనుండి మన భాషలోనికి గ్రంథములు పరివర్తితములయినవి. హిందీనుండి యెన్నికగన్న స్వతం త్రగ్రంథమేదియు నాంధ్రీకృతము కాలేదు. సుప్రసిద్ధము నవీనము మనోహరము నగుటచే నేనీ నాటకమును తెనిగించినాను.

ఇందలి గీతములను హిందీభాషనుండి పద్యరూపముగా నాంధ్రీ కరించి నాకొసంగుటయే గాక సర్వవిధముల నాకు సహాయ్యము చేసిన సాహితీసమితి సభాపతి శ్రీ శివశంకరశాస్త్రిగారికి సదాకృత జ్ఞుడను.

దీనిని దయతో స్వీకరించి సుప్రసిద్ధమైన తమ సరస్వతీ గ్రంథ మండలీ నాటకానుబంధమాలికలో ప్రకటించి నాకుత్సాహము నొసం గిన శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామి నాయుడుగారికి కృతజ్ఞత దెలుపు చున్నాను.

మాడభూషి సురేంద్రాచార్యులు

...ంటూరు
...బవరి ...

# ప్రథమాంకము

*

## మొదటి రంగము

[ఉపవనము. నేపథ్యమున వైశాలిని గానము.]

నాకుజూపింపు మోనాథ, నీరూపు!
అరుగుదెమ్మోనాథ, అంతికమ్మునకు;
కాదేనిపిలువు నీకడకు ప్రాణేశ!
నేడుదాగకుమయ్య, నీరదచ్ఛాయ,
కాయుము ప్రాణేశ, కౌముదీరుచులు,
వ్రజచంద్ర, అమృతంబు వర్షింపుమయ్య!
అలరులకెల్ల నీహాసం బొసంగి
వర్ధమింపుక నీవు, నవ్వింపునన్ను.
పాదశూలమ్ములు ప్రసవముల్ చేసి
ఫలములందేయుము ప్రసవముల్ నాథ!

[పాట చివరచరణము పాడుచు దండగ్రుచ్చుచు వైశాలిని ప్రవేశించుచున్నది. ఆకస్మికముగా నేదియో జ్ఞాపకము రాగా నామె వొక వృక్షమును సంబోధించి చెప్పుచున్నది.]

వైశాలిని

అది చిన్న బీజము; నా మనస్సును గదుపజాలకుండెను. నేను దానియందు లీనమయియున్న సౌందర్యమును జూడజాలకపోతిని. అంతను దానిని మిక్కిలి యశ్రద్ధతో నేలపై బడవేసితిని. పశువులభయముచే నదిభూమిలో దాగుకొనెను. ఆకాశమండల నీలమేఘ మెవరియాజ్ఞతనో గాని బాగుగా వర్షించెను; ఆబీజమును భూగర్భమునుండి బయల్వెడలించి మనోహరవృక్షరూపముగా మార్చి వెడలిపోయెను. అవృ

## ప్ర థ మా ం క ము

*

### మొదటి రంగము

[ఉపవనము. నేపథ్యమున వైశాలిని గానము.]

నాకుజూపింపు మోనాథ, నీరూపు!
అగుగుదెమ్మోనాథ, అంతికమ్మునకు;
కాదేనిపిలువు నీకడకు ప్రాణేశ!
నేడుదాగకుమయ్య, నీరదచ్ఛాయ,
కాయుము ప్రాణేశ, కౌముదీరుచులు,
వ్రజచంద్ర, అమృతంబు వర్షింపుమయ్య!
అలరులకెల్ల నీహాసం బొసంగి
నవ్వుమించుకనీవు, నవ్వింపునన్ను.
పాదశూలమ్ముల ప్రసవముల్ చేసి
ఫలములంజేయుము ప్రసవముల్ నాథ!

[పాట చివరచరణము పాడుచు దండగ్రుచ్చుచు వైశాలిని ప్రవేశించుచున్నది. ఆకస్మికముగా నేదియో జ్ఞాపకమురాగా నామె యొక వృక్షమును సంబోధించి చెప్పుచున్నది.]

వై శా లి ని

అది చిన్నబీజము; నా మనస్సును గదుపజాలకుండెను. నేను దాని యందు లీనమయియున్న సౌందర్యమును జూడజాలకపోతిని. అంత నేను దానిని మిక్కిలి యశ్రద్ధతో నేలపై బడవేసితిని. పక్షులభయముచే నదిభూమిలో దాగుకొనెను. ఆకాశమండల నీలమేఘ మెవరియాజ్ఞ చేతనోగాని బాగుగా వర్షించెను; ఆబీజమును భూగర్భమునుండి వెలువరించి మనోహరవృక్షరూపముగా మార్చి వెడలిపోయెను. ఆవృ

తుమును గ్రీష్మతాపమును శిశిరశీతమును, వాయుసంచలనములను సహించుచు నిలిచి తపమొనరించెను. తలవని తలంపుగా నొకనాడు కుసుమాకరుడగు వసంతుడు "వరమడుగుమ" నెను. పుష్పమా, నీ వ్యజ్యోతిచే నా మనస్సు నాకర్షించినావు. ఒకవేళ నీ వీస్థలమునం నిలిచి విసిగి వేసారినయెడల, నాకడకురమ్ము: హృదయమందు ధ. రిం తును. [ఆ పుష్పమునుగోసి రెండవపుష్పమును సంబోధించుచున్నది. మరి నీవుగూడ నొకవేళ నీగుచ్ఛమందు బాగుగా వికసించినచో, రమ్ము. నీ సౌందర్యమును సౌరభ్యమును నాకు దానముచేయుము. నా పుష్పదామమున నిమిడి వాడిపొమ్ము. చింతింపకుము. మనము మర్త్యలోకవాసులము: మన పరిణామ మిదియే ఉదయాస్తమయము లనే జీవనమందురు. [దానినిగూడ గోయుచున్నది. మూడవపుష్ప మును సంబోధించి ] నీవే యాశతో నుబ్బిపోవుచున్నావు? కాలము కఠినమైనది. దానివలన శుభఫలము చేకూరునని యాశింపకుము. నిన్ను జన్మింపజేసిన ధూళిలోనే కలిపివేయునుసుమా! కావున నీవు సుఖ మనుభవింపగోరుదువేని, రమ్ము. నిన్ను దేవతాచరణ సాన్ని ధ్యమున నమర్పించి మన ముభయులజీవనములు కృతార్థముగావింతును. [ఆ పుష్పమునుగోసి నాలుగవదానితో] నాయొడి పుష్పములతో నిండిపోయినది. జయమాలికనుగూడ గ్రుచ్చితిని. కాని యీ వృక్షా గ్రమున వికసించెడుపుష్పము నా మనస్సు నాకర్షించుచున్నది. పుష్ప మా, చేజిక్కక దూరమగుచున్నకొలది నీవింత మనోహరముగ గనబ డుచుంటివేమి? సమీపవస్తువే సుందరమగునేని, యీప్రపంచము నే డెంత సుఖదాయకముగ నుండెడిదో! ఏమైనను సరే, నిన్నవశ్యము కోయుదును, కోసి వరమాల గ్రుచ్చుదును; రేపటి స్వయంవరమున స్వామికంఠము నలంకరింతును. ఈకొమ్మను లాగుదును. రెండవకొ మ్మ తనంతటతానే వంగును. [దగ్గరనున్నకొమ్మను లాగుచున్నది.

పువ్వుమున్న కొమ్మగూడ గొంచెము వంగుచున్నది. కాని యాపువ్వు మామెచేతి కందకున్నది. అంత వైశాలిని కొమ్మను గట్టిగా లాగుచున్నది. లేతకొమ్మవిరిగి భూమిపై బడుచున్నది. కొమ్మ విరుగుటవలన కొంతప్రదేశము నావృతమగును. అచ్చటదాగియున్న అవీక్షితుడు గబడుచున్నాడు. వైశాలిని యతనినిజూచి యులికిపడుచున్నది. ఆమె నుండి సడలుచున్నది. కోసిన పువ్వులన్నియు నేలపై రాలుచున్నవి. భయకంపితస్వరముతో] ఎవరు?

అవీక్షితుడు

నీ సుందరవదనారవిందము పైనంకితమయియున్న భయభావము నాకెంతయు నింపుగొలుపుచున్నది!

వైశాలిని

మీ రెవరు?

అవీక్షితుడు

ఘాతుకమృగమునుకాను. [అని పడిపోయినపువ్వులను ప్రోగు చేయుచున్నాడు.]

వైశాలిని

కాని, మీ నేత్రములందు నాకు ఘాతుకమృగచిహ్నములు గానవచ్చుచున్నవి. సత్యముగా మీ రెవరో తెలుపుడు!

[భూమిపై రాలియున్న పుష్పములనన్నిటి నంతలో ప్రోవుచేసి వైశాలిని మీాద జల్లి]

అవీక్షితుడు

నీ యుపాసకుడను.

వైశాలిని

ఉపాసకులా?

అవీక్షితుడు

కాదు కాదు. నేను నాసంగతి చెప్పుటలో ద్వరవలన గొంచెము

పొరబడితిని. క్షమింపుము! నీయుపాసకుడను కాను, దాసుడను. ఇందు లకు గూడ దగనేని నన్ను నీపాదధూళిగా భావింపుము.

వై శా లి ని

పాదధూళియా?

అ వీ క్షి తు డు

అవును, పాదధూళిని. ఏవిధముగ సుధాకరుడు కళంకమును పుష్పము కంటకమును దాల్చెనో, యావిధముగనే నన్ను గూ స్వీకరింపుము.

వై శా లి ని

మీకు మతిభ్రమణ మాయెనాయేమి? అపరిచితులు, మీరిచ్చటి కేల వచ్చితిరి?

అ వీ క్షి తు డు

పరిచయ మున్నగాని రాగూడదాయేమి? పుష్పభ్రమరములకును, దీపపతంగములకును నెవరు పరిచయము చేసినారు? కుముదిని చంద్రు నకు రమ్మని యెప్పుడు జాబు వ్రాసినది? నీసన్నిధికి రాకుండ నుండ జాలకపోతిని; కావుననే వచ్చితిని.

వై శా లి ని

ఏమనుచున్నారు?

అ వీ క్షి తు డు

వాస్తవమే చెప్పినాను. ఇంకేమి చెప్పుదును? నేను కవివరుడనే యగుదునేని యలంకార భరితముగా నాయనురాగమును వర్ణించి యుందును. గాయకుడనే యగుదునేని నాయనురాగమును సరస సంగీ తరూపముగ బాడి నీకు గర్ణామృతము గావించియుందును. దౌర్భా గ్యవశమున కవివరుడను గాయకుడను కానయితిని! నీవిరహానలముచే నంతప్తుడనై నిద్రాహారములు లేక బహుమాసములు గడిపితిని. స్వప్న మందైనను నీవిది గమనించియుందువా? నిన్ను స్మరించి స్మరించి వ్యర్థ

నొందుచున్నను, సుధామధురమగు నానందమునుగూడ ననుభవించుచున్నాను. సూర్యునకు బగటివేళ కమలినిపై ప్రేమ. చంద్రునకు రాత్రులంటే కుముదినిపై ననురాగము. నాకో, అహర్నిశములు, నవిరామముగ నీపై ప్రేమ, ప్రియురాలా!

వై శా లి ని

శాంతింపుడు. ప్రియురాలా యనుట నాకు ప్రియమే; కాని మీ నోటినుండి మాత్రము విననొల్లను. మీ రిచ్చటి కెట్లు వచ్చితిరి? చెప్పుడు. ప్రతీహారులు ద్వారము కడ మిమ్ముల నడ్డగింపలేదా?

అ వీ క్షి తు డు

ప్రతీహారులు ద్వారము కడ నడ్డగించుటకు నియమింపబడిరా?

వై శా లి ని

మరి, ప్రతీహారులన నెవరు?

అ వీ క్షి తు డు

వసంతుడు పుష్పసమూహములతో నీయుపవనములోనికి బ్రవేశించుచున్నపు డేప్రతీహారియు నతని నడ్డగించుటలేదు. పుంస్కోకిల కాకలీరవముతో నీ యీ వనమున జొచ్చునపుడు ప్రతీహారులెచటనుండిరి? మేఘుడు వర్షముతో నిక్కడి ద్రుమ గుల్మలతాదులను దడుపుటకై యరుదెంచు నపుడతని నెవ్వరు నిషేధించుట లేదేమి? తుషారసహితుడై శిశిరుడు నీయుద్యానవనమున బ్రవేశించు నపుడతని నడ్డగించుట లేదే! నీ కత్యంతప్రియములగు పుష్పముల నతడు నేల రాల్చుచున్నాడే. నీవ్వదుహస్తముతో నాటిన లతల నతడు వాడజేయుచున్నాడు. యావదృతుశోభ నతడు హరించుచున్నాడే. కాని యతని నడ్డగించువా రెవరును లేరే! అతడు వచ్చునపు డడ్డగించువారు లేరు, పోవునపుడును నిలుపువారు లేరు.

వై శా లి ని

వృధాలాపము లేల? మీరు వచ్చునపుడు ప్రతీహారులు నిద్రించు చుండిరా?

అ వీ క్షి తు డు

లేదు. ఎదురుచూచుచున్నవారివలె గన్నులు తెరుచుకొనియే యుండిరి.

వై శా లి ని

మీరు గూఢముగా వచ్చితిరా?

అ వీ క్షి తు డు

లేదు. స్వధర్మమునుండి వారలను దప్పించి వచ్చితిని.

వై శా లి ని

ఎట్లు?

అ వీ క్షి తు డు

ధనమిచ్చి వశపరచుకొని.

వై శా లి ని

ఎంత సాహసము! రాజపుత్రిక వైశాలిని యుపవనమున ననుమతి లేకుండగనే ప్రవేశించినందులకు శిక్షయేమియో తెలియునా?

అ వీ క్షి తు డు

తెలియును.

వై శా లి ని

మరెందులకు బ్రవేశించితిరి?

అ వీ క్షి తు డు

నామానసమును బంధించుకొంటివి; శరీరమునుగూడ బంధింపుము. నంసిద్ధుడను!—

వై శా లి ని

నేను సైనికులను బిలిపింతును.

అ వీ క్షి తు డు

నాకా విచారము లేదు. నీ క్రోధముగూడ నా కాదరపాత్రమే. నీ ఖండన నీకంఠమును మధురతరము. నేను శిక్షసహింప సంసిద్ధుడను. కాని యొక్కమాట. ప్రేమకు ప్రతిఫల మిదియేనా? నీకిది న్యాయమా?

వై శా లి ని

మీకే భయమును లేదు. మీరు సామాన్యులవలె దోచుటలేదు. తమ రెవరు?

అ వీ క్షి తు డు

కరంధమ మహారాజుపుత్రుడను, అవీక్షితుడను.

వై శా లి ని

[ఆశ్చర్యముతో నులికిపడి] అ—వీ—క్షి—తు—లా?

అ వీ క్షి తు డు

అవును.

వై శా లి ని

[తనలో]ఇది యేమి! స్వేచ్ఛ నరికట్టదలచుచున్నారు? కాదు కాదు. నేనీ మోహమును నలిపివైచెదను. [ప్రకటముగ] మీరవీక్షితులా? కాని యిప్పటికే చాల జాగయినది.

అ వీ క్షి తు డు

జాగు దేనికి ?

వై శా లి ని

ఏమియు లేదు. మీరు తొలుదొల్త ధనమిచ్చి కావలివాండ్రను వశపరచుకొంటిరి. ఇప్పు డాధనముతోనే స్త్రీ హృదయమును గూడ వశపరుచుకొన వచ్చితిరా ? స్త్రీహృదయమును గొనజాలరు, అమ్మ జాలరు.

అ వీ క్షి తు డు

నా సౌందర్యముతోడను, నా గుణములతోడను, నాబాహుబలముతోడను జయింతును.

వై శా లి ని

మీమాటలు విశ్వసించు టెట్లు? మీ పరాక్రమమునకు ప్రమాణ మిదియేనా? మీరు చోరునివలె నా యుపవనమున ప్రవేశించితిరి. ఇ ట్లొకమాట యడిగెదను. నిజముగ మీరు క్షత్రియులేనా?

అ వీ క్షి తు డు

అవును, కాని—

వై శా లి ని

[అర్ధోక్తిలో] ఆగుడు. ప్రత్యుత్తరమునకు మారుగా తా మిచ్చటి నుండి దయచేయుడు.

అ వీ క్షి తు డు

వెళ్లుటకు బూర్వ మొకమాట చెప్పెదను.

వై శా లి ని

ఏమి?

అ వీ క్షి తు డు

రేపు నీస్వయంవరమా?

వై శా లి ని

అవును.

అ వీ క్షి తు డు

దేవతలను సహితము వరమడుగుటకై చేతులు జోడింప సంకోచించు కరంధమ మహారాజుపుత్రుడు, నేడు చేతులుజోడించి ప్రేమింపుమని నిన్ను యాచించుచున్నాడు. సుందరీ! నీ సౌందర్యజ్యోతిచే నాప్రా సాదమును ప్రకాశింపజేయుము. నేను బాహుబలముచే ముల్లోకము లను జయించి ని న్నధీశ్వరిని జేసెదను.

వై శా లి ని

మీరు ముల్లోకములను జయింపగలుగుదురు, కాని నాహృదయము నణుమాత్రమైనను జయింపజాలరు.

అపీక్షితుడు

జయింపవలెనని యభిలాషగూడ లేదు. జయించి నిన్ను దాసు రాలను జేయ దలపలేదు. నన్నే జయించి నీదాసునిగా జేసికొమ్ము. కాని రేపటి స్వయంవరమున నీజయమాలికి నాకంఠమునం దుంచుము.

వైశాలిని

రేపటి స్వయంవరమున భ్రాంతిగలుగకుండునట్లు బాగుగా మిమ్ము త్వరలను గుర్తింపనిండు.

అపీక్షితుడు

గుర్తించితివా?

వైశాలిని

ఆ, బాగుగా-కన్నులుమూసికొన్నను చెవులతో మీనవ్వడిని గ్రహింపగలను. నేత్రకర్ణములు శక్తిహీనములయినను స్పర్శచే మిమ్ము గుర్తింపగలను. మీవదనము నామానసమునందంకితమైనది. రేపటి స్వయంవరమున నేనువరించువీరుని వదనమిదికాజాలదు.

అపీక్షితుడు

[అదరిపడి] ఏమంటివి! ఏమివింటివి!

వైశాలిని

ఒకటియే నేను చెప్పినదేమీరువింటిరి. ఏకారణమువలన నైనను సరే. రేపటివరకు మీ మూర్తిని నాహృదయమందుంచుకొందును.

అపీక్షితుడు

నాయనురాగ మంగీకృతముకాదా?

వైశాలిని

కాదు.

అపీక్షితుడు

కాదు. నీవు పరిహాసముచేయుచున్నావు. ఇంతమనోహరమగు వదనమింత కఠినముకాజాలదు.

వై శా లి ని

పరిహాసము చేయుట వైశాలికియెరుగదు. ఇదిగూడనిజమే, అది గూడనిజమే.

అ వీ క్షి తు డు

నామీద నీకుప్రేమలేదా? నిశే

వై శా లి ని

ఉన్నది. కాని మీా మీాదగాదు, మీా ద్వేషముమీాద.

అ వీ క్షి తు డు

నీవు నన్ను పెండ్లియాడవా?

వై శా లి ని

మీారుకాక యింకేవరుడును లభింపనిచో. నేనాజన్మాంత మవివాహితనై యుందును. అంతనిలువజాలనిచో, కుటిలుడైన చంద్రునిగాని, మోడువారినమ్రాకునుగాని, నోరులేని శిలాప్రతిమనుగాని పెండ్లియాడుదును.

అ వీ క్షి తు డు

నామీాద నింతటివిరక్తికి గారణము?

వై శా లి ని

ఏమో.

అ వీ క్షి తు డు

నే నందముగ లేనా?

వై శా లి ని

నానేత్రములింతవరకు మీాకన్న సుందరపురుషుని గానలేదు. కాని స్త్రీ హృదయ మెల్ల వేళలసౌందర్యమునే వాంఛింపదు.

అ వీ క్షి తు డు

నీ కడపటి నిశ్చయమిదియేనా?

వై శా లి ని

అవును.

అ వీ క్షి తు డు

ముమ్మాటికి నిది నిశ్చయమా?

వై శా లి ని

ఆ.

అ వీ క్షి తు డు

దీనికి బ్రతీకారము?

వై శా లి ని

ఎరుగుదును. మేము దుర్బలులము. మా రాజ్యము మీ తండ్రి యధీనమున నున్నది. మీ రేమి చేయుదురు? మీరు మమ్ముల భిక్షుకులను జేయుదురు, మా కిరీటమును చూర్ణము చేయుదురు, మా సుఖమునణగ ద్రొక్కుదురు. మా సంపదలను నపహరింతురు. కాని నా ప్రేమను బలాత్కరించి గ్రహింపజాలరు. జీర్ణవస్త్రములు ధరించి, యా కలిగొన్న వైశాలిని ఏనాడు ధన బలరూపములను మోహింపక తనంతట తానే ప్రేమించునో యది శుభ వాసరము.

అ వీ క్షి తు డు

అటులగుట యసంభవము. నీవు నాకొఱకే యుద్భవించితివి. నీవు నా దానవే యగుదువు. రేపటి స్వయంవరమున నీవు నన్ను వరింపని యెడల, నేనే నిన్నపహరించుకొని పోయెదరు.

వై శా లి ని

చూచెదను. ఇది వట్టి యాశాస్వప్నము! అర్థమెరుగక వలికెడి చిలుక పలుకులివి. ఇందలి సారము మీకు దెలియదుగాని నాకు దెలియును. పొండు. చేయగలిగినది చేయవచ్చును!

[హేయభావముతో వైశాలిని వెడలిపోవుచున్నది]

అ వీ క్షి తు డు

ఎంతటి పరాభవము! రేపటి స్వయంవరమందు నిజముగ వైశాలినిని నేను హరింపజాలనిచో, వైశాలిని నాది కాకపోయినచో, ఏమి

చేయుదును! నిజముగ నప్పు డేమిచేయుదును? విరాగినయి నిర్జనవన మందెచ్చటనో నర్యనము లభ్యాయనము చేయుదునా? కాదు కాదు. స్త్రీవిరోధి నయ్యెదను! వృథ్వియందు, స్త్రీవివాహ మాన్పుటకు స్త్రీమేధము చేయుదును! స్త్రీజాతిని సంహరించుటకు శివునిగూర్చి తపస్సు చేయుదును. సృష్టినుండి స్త్రీజాతి లేకుండ బోవునట్లును, వృక్షలతలయే గర్భములనుండి పురుషులే యుద్భవించునట్లును వరము పొందుదును పాషాణహృదయా! [అవీక్షితుడు నిట్టూర్పు విడిచి వైశాలిని పోయిన మార్గము వంకకు జూచుచున్నాడు. ఆమె యెక్కడ గనబడకపోవుట వలన హతాశుడగుచున్నాడు. ఆమె మీద జల్లిన పూవులను జేతులందు దీసికొని ముద్దుపెట్టుకొనుచున్నాడు. మరల నిట్టూర్పు విడిచి యాకాశమువంక దీనముగా జూచినాడు. తిరిగి శిరమును గ్రిందకు వంచి మెల్లమెల్లగా వెడలిపోవుచున్నాడు. పోవునప్పుడు వైశాలిని చనిన మార్గమువైపు కొన్ని పర్యాయములు చూచినాడు.]

---

## రెండవ రంగము.

### స్వయంవర మండపము

[తోరణములు ధ్వజములు మొదలగుగాగల మంగళ వస్తువులతో నాస్థల మలంకరింపబడినది. ఒక వంక స్త్రీలు, మరియొక వంక పురుషులు కూర్చున్నారు. ఎత్తైన మండపము మీద నానాదేశాగత రాజపుత్రు లుపవేశించియుండిరి. మండపమున నొకవైపున పూలతోట, మరియొకవైపున సరస్సును గలవు. నడుమ మార్గము క్రమక్రమముగా జిన్నదగుచు వృక్షములలో నదృశ్యమాయెను.]

[మూకదృశ్యము. వాద్యములు మధురముగా మ్రోగుచున్నవి. తరువాత రాజపుత్రిక వైశాలిని చేత వరమాల బట్టుకొని మండప

మందు బ్రవేశించుచున్నది. రాజపుత్రులందరు నుత్సుకులై యామె వంక జూచుచున్నారు. తటాలున మార్గమునుండి అవీక్షిత రాజకుమారుడు రథోపవిష్టుడై వచ్చుచున్నాడు. కాని ఎవరు నతనిని జూడలేను. కా శాలిని రాజపుత్రులందు అవీక్షితుని వెదకుచున్నది. అతడచ్చట గనక పోవుటవలన నాశ్చర్యబడుచున్నది. ఆసమయమందే అవీక్షితుడు మండపద్వారసమీపమునకు వచ్చుచున్నాడు. రథమునుండి దిగి, త్వరితత తితో మండపమున బ్రవేశించి, వైశాలిని నపహరించి, యామెను రథమున కూర్చుండబెట్టుకొని వెడలిపోవుచున్నాడు. సభయందుగల్లోలము. యోధులందరు తమశస్త్రములను ఝళిపించి అవీక్షితుని వెంబడించుచున్నారు.]

---

మూ డ వ ర ం గ ము

అ ర ణ్య ము

[రథోపవిష్టులై వైశాలిని అవీక్షితుడు ప్రవేశించుచున్నారు.

అ వీ క్షి తు డు

వైశాలినీ, నాబాహుబలమును గాంచితివి గదా?

వై శా లి ని

[ప్రత్యుత్తర మీయక యేమో యాలోచించుచున్నది.]

అ వీ క్షి తు డు

సుందరీ, ఊరకుంటివేమి? నాపరాక్రమము నుగ్గడించుటకై యోగ్యమైన భావములను శబ్దములను వెదకుచుంటివా? నిజము చెప్పుచున్నాను. నాకతిశయోక్తియన గిట్టదు. నీనోటినుండి వెలువడు సాధారణశబ్దమే నన్ను సంతోషపెట్టగలదు. సుముఖి! ఒక్క పర్యాయము స్వయంవరరంగమును జ్ఞప్తికి దెచ్చికొమ్ము. అక్కడ బ్రపంచమందు వన్నెకెక్కిన వీరులు కూడియుండిరి. ఆవీరమండలిమధ్యముగా, మూర్తి

భవించిన కోమలత్వము చేత సుకుమారకుసుమదామమును గ్రహించి కోమలవదనముతో దనభర్త నన్వేషింప నరుగుదెంచినది. అప్పుడు నేనెంతనేర్పుతో నిన్నపహరించితిని! రుక్మిణీహరణమునకును, సుభద్రాహరణమునకును నిది తీసిపోవునా? నే నొంటరిగనే యద్వితీయపరాక్రమముచే నిన్నాహరించితిని. దేవేంద్రుని తలదన్నెడి వీరులు గొయ్యబారిరి. వారి బాణములు తూణీరములలో లీనమయిన శస్త్రాస్త్రప్రయోగము వారు మరచిపోయిరి. వారి ఖడ్గత్రిశూలగదాద్యాయుధములు హస్తములందే యుండిపోయినవి. అవయవములు వారి యధీనమున లేకుండెను. నిన్ను హరించినంతనే నేను వారి పరాక్రమమునుగూడ హరింపలేదా? చెప్పుము. నేనసత్యమాడుచున్నానా?

వై శా లి ని

[పూర్వమువలెనే ప్రత్యుత్తరమీయలేదు.]

అ క్షీ క్షి తు డు

అందరురాజులు కలిసి మీజనకుని నాయకత్వముక్రింద నన్ను వెంబడించినప్పు డేవిధముగ నేను సారథ్యమును యుద్ధము నొకేసారి చేసితినో చూచితివిగదా? ముద్దుగుమ్మా, నీ వారంగమును మరచిపోయితివా? నే నొకచేతితో గళ్ళెమునుబట్టుకొని రథము నడుపుచుంటిని; వేరొకచేతితో బాణవర్షముకురిపించి శత్రువులను వెనుకకు మరల్చుచుంటిని. నీ విప్పటికిగూడ మాటలాడుటలేదేమి? మృదుభాషిణీ! నీ యధరములంకారప్రాయముగ శోభకొరకే సృష్టింపబడినదా? కాదు కాదు, ఇది సత్యము నను మోదించుటకును, అసత్యము నవరోధించుటకునుగూడ సృజింపబడినదిసుమా.

వై శా లి ని

[నిట్టూర్పువిడిచి యూరకున్నది.]

అ వీ క్షి తు డు

ఇదియేమి? నాకలిన ప్రయాసమంతయుగూడ నీ ప్రేమను సంపాదిం

చూటకు చాలలేదా? నిజముగనే నీకు నాపై ప్రేమలేదా? నిన్ను నేను జయింప జాలకుంటినా?

వైశాలిని

కా నిస్సందేహముగనే! నాశరీరమునకు మీరు ప్రభువులై తిరి.

అవీక్షితుడు

మరి నీప్రేమయో?

వైశాలిని

తప అది యింతవరకు నాదే.

అవీక్షితుడు

అటులయిన రథమునుండి దిగుము. నేను నీప్రేమనుగూడ సంపాదింతును. శత్రువులతో బోరాడిబోరాడి నాయవయవములు జర్జరితములయినవి. మనోభావములతో బోరాడిబోరాడి నీవుగూడ నలసిపోతివి. నీనేత్రములు ప్రభాత కమలములువోలె నార్ద్రములయినవి. ఉదయ చంద్రునివలె నీవదన బింబము మలినమయియున్నది. మనలోనొకరు శరీరిక పరిశ్రమవలనను, మరియొకరు మానసిక పరిశ్రమవలనను విసిగి పోయినారు. రమ్మా మనము నిశ్చింతులమై యీయశోక వృక్షచ్ఛాయనుగూరుచుండి కొంచెము సేపు సేదదీర్చికొందము. మనలను వెంబడించిన శత్రువు లోడిపోయి వెనుకకు మరలినారు. వారువత్తురను భయము లేదు. నీకొరకు చల్లని నదినుండి తామరాకున స్వచ్ఛసలిలముగొని వత్తును. నీవుస్వస్థురాలవైనపిదప మనరాజ్యమును గురించి చెప్పెదను. మనల నెదుర్కొనుటకై వేచియుండెడి ప్రజానమూహమును నీమనోనేత్రమునకు గోచరించునట్లుచేసెదను. పిమ్మట భూమండలాధీశ్వరివగుదువను సువార్తవినిపించి నీప్రేమకు బాత్రుడనగుదును. నీకోమల హస్తమీ వరమాలను బట్టుకొనియుండి కందిపోయినది. అప్పుడు నీవు దీనితో జీవనభారమునుగూడ నాభుజములందు వేయుదువుగాని రమ్ము దిగుదము.

[ఇరువురు రథముదిగిరి. వైశాలిని యశోకవృక్షచ్ఛాయయందు గూర్చున్నది. అవీక్షితుడు ధనస్సుబాణములు నచ్చటనుంచి జలము తెచ్చుటకై నదీతటమునకు బోయినాడు.]

వై శా లి ని

[వరమాలను సంబోధించి.] ఈవరమాల తనకార్యము నెరవేర్చుకొనకుండ వాడిపోవుచున్నది. నేననుకొన్నదేమి, జరిగినదేమి! మానవుల యాశకును విధివిధానమునకు నింత వైరమెందులకు? ఓవరమాలా నిన్ననిన్న కూర్చినపుడు ఒక్కొక్క పుష్పముతో నొక్కొక్క యాశను ఒక్కొక్క రెక్కలో నొక్కొక్క భావమును గూడ బెట్టియుంటిని. అయ్యో! నీదశ నేడిట్లున్నది. నేనేమిచేయుదును? ఈజీవనము సుఖమయమగునా? లోకమున కధీశ్వరునై నేనేమి చేయుదును? బలాత్కారమువలన బ్రేమింతునా! కాదుకాదు. నేనిట్లు చేయుదు. శారీరక స్వాతంత్ర్యము పోయిననుసరే, మానసిక స్వాతంత్ర్యమును గోల్పోవజాలను. ఏమిచేయుదును? ఈరథమెక్కి పారిపోవుదునా? ఇదిమంచి తరుణము. ఇట్లేచేయుదును గాక.

[వైశాలిని రథమువంకకు మరలగానే, ఆకస్మికముగ నదీతీరము నుండి అవీక్షితుని కేక వినబడుచున్నది.]

అ వీ క్షి తు డు

[నదీతటమునుండి] రక్షింపుము వైశాలినీ; రక్షింపుము!

వై శా లి ని

ఎట్టిదీనస్వరము! [అటుచూచి] ఇదేమి? నదినుండివెలువడి మొసలి రాజకుమారుని మ్రింగబోవుచున్నది!

[వైశాలిని శీఘ్రముగా అవీక్షితుని ధనస్సుబాణము నెత్తి మొసలి మీదికి బాణమువదలుచున్నది. బాణము మొసలిని సంహారించినది. అంత వైశాలిని సంతోషపడుచున్నది.]

అవీక్షితుడు

[నేపథ్యమునుండియే] వైశాలినీ, ధన్యురాలవు!

వైశాలిని

వారుపరుగిడుచు నిటువైపే వచ్చుచున్నారు. నాకెట్టి విఘ్నము ప్రాప్తించినది! నేను తెలిసియే తరుణమును బోగొట్టుకొంటిని. ప్పుడు చాలజాగైనది. నేను పారిపోజాలను అయ్యో! [వరమాల తపాత్తి] ఇప్పుడు దీనిని త్రెంపి పారవేసెదను!

[వరమాలను త్రెంపుటకు సిద్ధము కాగానే, అవీక్షితుడు జలము తీసికొనివచ్చును. వైశాలిని యూగిపోవు చున్నది.]

అవీక్షితుడు

ప్రియే! నీవు నేత్రములతోనే గాదు, హస్తములతో గూడ బాణములు విడుతువని నాకిప్పుడు తెలిసినది. నీదయయే మరల నన్ను నీకొరకు బ్రతికించెను. ఇదిగో, జలము త్రాగుము.

వైశాలిని

నా తృష్ణ జలము వలననే తీరదు. [వరమాల త్రెంపబోవుచున్నది.]

అవీక్షితుడు

ఆఁ, ఆఁ, ఎంతపని చేయుచున్నావు! దీనిపని యింకను ముగియ లేదు. దీనిని నాకంఠమందుంచుము. ముందరికి బోవుచున్నాడు.

వైశాలిని

దూరముగనుండుము. తాకకుడు!

అవీక్షితుడు

ఇట్లనుటకేనా నన్ను మృత్యువు బారినుండి తప్పించినది! నీదయ యెంత కఠినమైనది! మొసలినిజంపి నన్నురక్షించినపుడు నీప్రేమను సంపాదించితినని సంతసించితిని. అది భ్రమయేనా?

వైశాలిని

అవును.

అవీక్షితుడు

పట్టిది. నామీద ప్రేమలేకుండిన నన్నెందుకు గాపాడితివి?

వైశాలిని

నే నెవ్వరిని గాపాడలేదు.

అవీక్షితుడు

అట్లయిన, నకారణమున మొసలి చనిపోయెనా? నామీదనే నీ బాణమును గురిపెట్టియుంటివా?

వైశాలిని

కాదు.

అవీక్షితుడు

అదికాదు, ఇదికాదు, వైశాలినీ, తికమకపెట్టుచున్నావు! నీవే తాత్పర్యముతో నీలోకములోనికి వచ్చితివి? నీప్రేమ నెప్పుడు గ్రహింపగలను ప్రియే?

[అవీక్షితు డామెచెయ్యి పట్టుకొనుచున్నాడు.]

వైశాలిని

చెయ్యివిడువుడు.

అవీక్షితుడు

నా కధికారములేదా?

వైశాలిని

ఉన్నది. కాని యితరుల యధికారము విడిచినతరువాత.

అవీక్షితుడు

ఎవరి యధికారము?

వైశాలిని

నాహృదయముది. మీా కీహస్త మవసరమా?

అవీక్షితుడు

నిస్సందేహముగ.

వైశాలిని

అటులయిన దీసికొనుడు. [కత్తిదూయుచున్నది]

అవీక్షితుడు

ఇదియేమి? దీనిని గోసి నాకిత్తువా? వలదు వలదు. నా కీహస్తమే కాదు, నీ సంపూర్ణశరీరము కావలయును.

వైశాలిని

దానినే తీసికొనుడు. [కత్తియెత్తుచున్నది.]

అవీక్షితుడు

నడుమ నీకత్తియేల?

వైశాలిని

తొలుదొల్త దీనిని సృజించిన యాగమం దుండెడు ప్రభావమే యిప్పుడు గూడగలదు. భయములేదు. బందిపోటుదొంగ దీనితో నమాయకులను సంహరించుచున్నాడు. అనపరాధులగు ప్రజలను రాజు దీనితో ఖండించుచున్నాడు. దీనితో బుణ్యకార్య మెవ్వరును జేయరు. నేను చేసెదను.

అవీక్షితుడు

అనగా?

వైశాలిని

మీ చరణములం దర్పించుటకు నాశరీరము నాత్మబంధనమునుండి విముక్తము చేయుదును.

అవీక్షితుడు

[అదరిపడి] వైశాలినీ!

వైశాలిని

చింతింపకుడు. ఈశరీరము మీయదియే యగును. మీయిష్టమైన యెడల దీని నడవిమృగములపాలద్రోయుడు. లేదా మీ విలాస భవనమునకు దీసికొనిపొండు.

[వైశాలిని రొమ్మును బొడుచుకొనుటకై కత్తిని పైకెత్తగానే అవీక్షితు డడ్డగింప ముందరికి బోవుచున్నాడు. అంతకుబూర్వమే నేపథ్యమునుండి తటాలున నొకబాణము వచ్చి అవీక్షితుని బడవేయు చున్నది. ఇది చూచి వైశాలిని చేయి క్రిందికిదించి నేపథ్యమువంకయే నౌత్సుక్యముతోను భీతితోను జూచుచున్నది.]

అ వీ క్షి తు డు

[మెల్లమెల్లగా లేచి] ఇదియేమి? [నేపథ్యమువంకకు జూచి] ఆఁ. శత్రుసేన నన్ను వెంబడించుచు వచ్చినదా? [వైశాలినితో] ప్రియే! [మరియొకబాణము వచ్చి అవీక్షితుని గాయపరచుచున్నది.] ఆగుడు ఆగుడు. నా శస్త్రమును వెదుకుకొననిండు. ఇదియేమి? నా ధనుస్సే మయినది? [ధనుస్సు నెత్తుచున్నాడు కాని బాణము దొరకదు.] బాణము! [నేపథ్యమునుండి కొన్నిబాణములు వచ్చి అవీక్షితుని బాగుగా గాయపరచుచున్నవి. అతడు వైశాలినిని సంబోధించి] ప్రియే! బాణము! [అవీక్షితుడు కాతరస్వరముతో నని దీనముగా వైశాలినివంక జూచు చున్నాడు. అవీక్షితుని యాపదజూచి వైశాలినికి జాలియు ప్రేమయు గలుగుచున్నవి. ప్రేమతోడను, చింతతోడను గూడిన స్వరముతో నామె ప్రత్యుత్తర మిచ్చుచున్నది.]

వై శా లి ని

బాణమా? అన్నియు నయిపోయినవి. నేను తుదిబాణముతో మొసలిని గొట్టితిని.

అ వీ క్షి తు డు

అయ్యో! ఎంత దురదృష్టము! [బాణము లొకటివెంట నొకటి వచ్చుచున్నవి.] ఆగుడు, నాకడ శస్త్రము లేదు. మీరనేకులు, నే నొక్కడనే కాని యీవిచారము నాకులేదు. నాకడ నాయుధ మేమియును లేదు. మీరు ధర్మాత్ములగుదు రేని నా కొక శస్త్రమునిండు.

[ఎవ్వరు నేమియు వినలేదు. అవీక్షితుడు నేలపై బడిపోవుచున్నాడు.]

వైశాలిని

వీరు నిజముగ క్షత్రియకుల కలంకులు! శస్త్రహీను నిందరు బాణ కాండాలతో ప్రహరించుచున్నారు!

అవీక్షితుడు

వైశాలినీ! [అప్పుడే యొక బాణము వచ్చి అవీక్షితుని రొమ్మున తగులుచున్నది.] వైశాలినీ! అయ్యో, ఇదియే నా మన చివర సమ్మేళనము

వైశాలిని

చింతితురాలై] అవీక్షితా!

అవీక్షితుడు

నాదగ్గర నిప్పుడైనను శస్త్రముండిన యెడల—

వైశాలిని

లెండు. ఇదిగో, ఈ ఖడ్గమును దీసికొండు. నేనిప్పు డాత్మహత్య చేసికొనను. పొండు శత్రుసంహారము చేయుడు. నా ప్రేమయే మీకు కవచమగును.

అవీక్షితుడు

వైశాలినీ! ఏమంటివి? ఇది విని శవముగూడ సజీవమగును. ఇమ్ము ఈ చిన్న ఖడ్గమే నాకు బ్రహ్మాస్త్రము! నీవీ చెట్టుచాటున నిలుచుండి నా బాహుబలమును వీక్షింపుము.

[వైశాలిని చెట్టుచాటున నిలుచున్నది. అవీక్షితుడు వచ్చుచున్న బాణముల నరకును. శీఘ్రముగనే శత్రుసేన అక్కడికి జేరుచున్నది. అందరు కలిసి అవీక్షితుని మీదబడుచున్నారు. అవీక్షితు డొంటరిగా వారితో బోరాడుచున్నాడు. కొందరు రాజులను, విశాలుని సైనికులను కొందరను నరకినాడు. వైశాలిని చెట్టుచాటునుండి చూచి సంతోషపడుచున్నది. అవీక్షితుడు యుద్ధము చేయుచు గాయములవలన మూర్ఛపోయెను. విశాలుడు ప్రవేశించుచున్నాడు.]

వి శా లు డు

వైశాలినీ!

వై శా లి ని

[చెట్టు చాటు నుండి వెలువడి] జనకా! ఇది యధర్మయుద్ధము.

వి శా లు డు

[సైనికులనుజూచి] రాజకుమారుని బంధింపుడు.

వై శా లి ని

శస్త్రహీనుని బలువురు కలిసి నేలపైబడవేసితిరి! మూర్ఛితుని బంధించినగాని విదిశామహారాజునకు గౌరవము నిలువదా?

వి శా లు డు

వైశాలినీ! అట్లయిన నీకిప్పుడేమి కావలెను?

వై శా లి ని

ఏది ప్రధానమో యదియే కావలెను. నా జనకుని సైన్యము వీరిని గాయపరచినది. శుశ్రూషచే వీరికారోగ్యము నేను కలుగజేసెదను.

వి శా లు డు

సరే. [సైనికులతో] ఈ రాజకుమారుని జాగరూకతతో రథముపై నెక్కించి రాజధానికి గొనిపొండు.

వై శా లి ని

స్వయముగా రథమునడిపెదను. ఇప్పుడు నావంతు.

[ఇరువురు సైనికులు అపేక్షితుని రథముమీద బరుండబెట్టుచు న్నారు. వైశాలిని రథమును రాజధానివంకకు దోలుకొనిపోవుచు న్నది. మెల్లమెల్లగా నందరు వెడలిపోవుచున్నారు.]

నాలుగవరంగము

[రాజప్రాసాదము]

[గాయముతగిలిన అవీక్షితుడు నిద్రించుచున్నాడు. వైశాలిని శూష చేయుచున్నది—తీగెనలిపి రసముతీసి అవీక్షితుని రొమ్మున్న
ది వస్త్రమును దొలగించి గాయముపైరసము పూయుచున్నది ]

అవీక్షితుడు

[తటాలున మేల్కాంచి] మీరెవరు?

వైశాలిని

వైశాలినీ రాజకుమారికను.

అవీక్షితుడు

మరి నేనెవరు?

వైశాలిని

మీరా?

అవీక్షితుడు

తెలిసినది. నేను యుద్ధమందు బరాజితుడనైన మీబందీని. అయ్యో! నాశక్తి గర్వము నణచివైచి యెచ్చటికి బోయినది? నిశ్చయముగనే మీబందీని బందిమీద నీకింత యాదర భావమెందులకు?

వైశాలిని

నాకు తెలియదు.

అవీక్షితుడు

నీకు తెలియదా? రాత్రియంతయు జాగరముచేసి వీవనతో విసరి నన్ను నిద్రపుచ్చుచున్నావు. నీవు నిద్రాహారములు త్యజించితివి. ఆ నాడు నా గాయములు గడిగి మందుపూయుచున్నపుడు నిన్ను చూచితిని. నీనేత్రయుగళి యార్ద్రమయ్యెను. నావదనమున మందస్మితాం కురముకొరకు నీవు నీనేత్రములనుండి గంగాప్రవాహమువలె బాష్ప

ములు కురిపించుటకు సంసిద్ధురాలవై యున్నావు. నీకు దెలియనియెడల నాకు మాత్రము తెలియునా ?

వైశాలిని

మీకు బాధతగ్గినదా ?

అవీక్షితుడు

నన్నడుగు టెందులకు? నీవు పడినశ్రమ నడుగుము. నా స్వామికొరకై యర్పించిన నిద్రాహారాదుల నడుగుము.

వైశాలిని

ఈరసమువలన బాధ తగ్గిపోయినదా?

అవీక్షితుడు

అయ్యో! ఆనాడు నీయుద్యానవనమునందు నేను అవీక్షితరాకుమారుడనై యున్నపుడు, నా భుజములం దపరిమితమైన బలమున్నపుడు, నేత్రములందు విజయమున్నపుడు, పార్శ్వమందు జగత్కిరీటమున్నపుడు నాయెడ నింతయాదర మేల చూపవైతివి?

వైశాలిని

[వదనమునందు బశ్చాత్తాపభావము కనబడుచున్నది. ఊరకనే యున్నది.]

అవీక్షితుడు

ఆదరింపకపోయినను సరే, అనాదరమేల చేసితివి ? నన్ను ద్వేషించి సాభిమానముగా వెడలిపోయితివి. నీ యుపవనమందలి ప్రతిశాఖయు నీయిచ్ఛానుసారము నావైపు తిరిగి నన్ను తిరస్కరించునపుడును, ప్రతి పుష్పము నన్ను పరిహసించునపుడును, ప్రతికంటకము నన్ను బాధించునపుడును, నీ యీజాలియే పొదరింట డాగెను?

వైశాలిని

నాకు దెలియదు

అపీక్షితుడు

నీకంతయు దెలియును. నాయవస్థ మారగనే నీస్వభావ మేల యింతగా మారినది ?

వైశాలిని

కా నాయనురాగము నీడవలె మిమ్మంటియున్నది. ఆ ద్వేషశృంఖలము ట్లు తెగిపోయినవో నాకే యెరుకలేదు. నా దయాద్వారము మీా తన ౦ర కున్నాసక్తమైనది. ఈలతను వెదకి, వనమునుండి మీాకొరకు దెచ్చితిని. ఈరసమువలన మీా ప్రాణబాధాశేషము గూడ బోవునని యొకానొక మహర్షి సెలవిచ్చినాడు.

అపీక్షితుడు

నా వ్రణమును గూర్చి చింతింపకుము. బాధతగ్గినది. నిన్నొకమాట యడిగెదను. ప్రత్యుత్తర మిత్తువా ?

వైశాలిని

ఆ.

అపీక్షితుడు

నీస్వయంవర మెప్పుడగును ?

వైశాలిని

స్వయంవర మేమి ?

అపీక్షితుడు

రెండవస్వయంవర మగునని వింటిని.

వైశాలిని

అవును. నాతండ్రి బలవంతమువలన.

అపీక్షితుడు

కాని—

వైశాలిని

నా కిష్టము లేదు.

అ పే క్షి తు డు

ఎందువలన ?

వై శా లి ని

ఎందులకు ? న న్నిట్లెందులకు ప్రశ్నించుచున్నారు? మీరు కఠిన హృదయులు. నాకు స్వయంవరముతో పనియేమి?

అ పే క్షి తు డు

ఏమనుచున్నావు ? నీవివాహ మయినదా?

వై శా లి ని

అయినది.

అ పే క్షి తు డు

ఎవరిని వరించితివి ?

వై శా లి ని

నావారినే.

అ పే క్షి తు డు

అంతటి భాగ్యవంతు డెవరు ?

వై శా లి ని

తొలుదొల్త వారిని ప్రేమింపకుంటిని. వారిని బాగుగా గ్రహింప నైతిని. పిమ్మట వారు వీణెమీటుచు పశ్చిమదిఙ్మండలమునవనున్నపుడు వసంతాంతమున గాంచితిని. ఆనాడు వారు సంపూర్ణాలంకృతులై యుండిరి. వారి యాకృతి నాకు గన్నుల పండువాయెను. అంత నేను మోహించి వారికంఠమునందు వరమాల నుంచితిని.

అ పే క్షి తు డు

మర్మగర్భమైన నీ వర్ణనయందు నాప్రశ్నకు సమాధానము రాలేదు. వరించినది నన్నేనా ?

వై శా లి ని

[ఊరకున్నది.]

అవీక్షితుడు

నన్నే నీవు వరించియున్నయెడల బొరపడితివి. నన్నాదరించుట మొదటితప్పు. తిరుగ నన్నాదరించుట రెండవతప్పు. సుందరీ! నిజము కా[illegible] నీకు నామీద ప్రేమగలదా? సావధానపూర్వకముగా హెచ్చరించుచున్నాను. బందీని భర్తగా బరిగ్రహింపకుము. నేనుసర్వస్వముగోల్పోతిని. నేడు భిక్షుకుడను. రాజకుమారుడను గానుసుమా! గమనము మా[illegible]ప్పుము గజగామినీ! కానిచో ప్రపంచము నిన్నేమనును?

వైశాలిని

స్త్రీ ప్రపంచమును లెక్కచేయదు. రమణి నిశ్చయించుకొన్నపిమ్మట వెనుదిరుగదు. తనభావము కామె యధీనురాలు.

అవీక్షితుడు

[అదరిపడి] నీకు నామీద ప్రేమగలదా?

వైశాలిని

నిర్దయుడా! కలదనిచెప్పవలయునా? దీనికినిదర్శనముగూడగావలెనా? మీ కింతవరకు నిది తెలియలేదా? మీరు యుద్ధము చేయునపుడు నేను మీకొరకు జింతించితిని. మీరు పరాజితులై మూర్ఛితులైనపుడు నేను మీకొరకీశ్వరుని బ్రార్థించితిని. గాయముతగిలిన మిమ్మిచటకు గొనివచ్చి మీకు శుశ్రూషచేసి చికిత్స జేసితిని. మీ పెదవులమీది నిట్టూర్పులుచూచి నా నేత్రము లశ్రుపూర్ణములగుచుండెడివి. మీకు బాధతగ్గినపుడు నేను ప్రపంచమున కధీశ్వరినయినట్లు భావించితిని ఇప్పటికిగూడ 'నీకు నామీద ప్రేమగలదా' యని మాటిమాటికి బ్రశ్నించుచుంటిరా?

అవీక్షితుడు

ప్రేమకాదిది, దయ.

వైశాలిని

దయయు ప్రేమయు నొకటిగాదా?

ఆపీక్షితుడు

ఒకే తత్త్వమునుండి యుత్పన్నమయినను జలము జలమే, హిమము హిమమే

వైశాలిని

అనగా?

ఆపీక్షితుడు

దీనస్వరముతో యాచించెడి భిక్షుకుడు నీదయకు పాత్రుడగును. అతని దుఃఖోపశమనమునకు నేదైననిత్తువు. కాని వానికడనుండవు, వానివంకజూడవు, వానికొరకెదురుచూడవు. వానినిగూర్చి చింతింపవు.

వైశాలిని

మీ స్వభావమును వెల్లడిచేయుచున్నారు. తాము ప్రేమించినవారిపై బురుషులకు దయయుండదు; తాము కనికరించినవారిని పురుషులు ప్రేమింపరు. రాముడు సీతను ప్రేమించెను. ఆమెయెడ నతనికి దయలేదు. ఆ సుకుమార గాత్రగర్భవతియైయున్నప్పుడు, ఆమెకు దారుణమగు దండననిచ్చి యడవులకు బంపెను. దుష్యంతునకు శకుంతలమీద దయగలదు. కాని యామెనాతడు ప్రేమింపలేదు. దుష్యంతుని యాశ్రయమును బొందుటకామె యరుదెంచినపుడు, పాషాణహృదయుడై యతడా కోమలాంగిని త్యజించెను. కాని స్త్రీమో — తాను ప్రేమించినవారి యెడ స్త్రీకి జాలికూడనుండును. తాను కనికరించిన వారిని ప్రేమించును.

ఆపీక్షితుడు

వైశాలినీ, నేను భావించినదానికంటెగూడ నీవధిక శ్రేష్ఠురాలవు. నేను మొదటనున్నట్లిప్పుడులేను. అయ్యో, ఎంతపరివర్తనమాయెను! [నిట్టూర్పుపుచ్చుచున్నాడు.]

వైశాలిని

ఈ లతారసమారిపోవుచున్నది. మీ బాధసంపూర్ణముగా తగ్గిపోవును.

అవీక్షితుడు

నాబాధనుగూర్చి చింతయేమియులేదు, కాని నీకోమలహస్తము చాలానేపటినుండి దీనిని బట్టుకొనియుండి కందిపోయినది.

వైశాలిని

అటులయిన నదిగో, ఈరసమును మీగాయముమీద బూసికొండు. ...కుగూడ శాంతిగలుగును. నాచేతికిగూడ విశ్రాంతికలుగును.

అవీక్షితుడు

వలదు వలదు. నలిగిన యీలతను గ్రిందబడవేయుము. మరలనిది చిగుర్చును. నాగాయముమాత్రము మానదు. నేడది బయటమాని నట్లున్నను లోపల యథాప్రకారముగానే యున్నది.

వైశాలిని

నేడిట్లు మాట్లాడుచున్నారేమి?

అవీక్షితుడు

పొమ్మసుందరీ, పొమ్మ, నీజనకునికడకుబొమ్మ. ద్వితీయస్వయంవరమును నిర్ణయింపుమని వారినిబలవంతపెట్టుము.

వైశాలిని

మా నాయనగారిచ్చటలేరు.

అవీక్షితుడు

ఎచ్చటికిబోయిరి?

వైశాలిని

యుద్ధభూమికి.

అవీక్షితుడు

అకారణముగా నేశత్రువు మీరాజ్యముమీదికి దండువెడలినాడు?

వైశాలిని

కరంధమ మహారాజు — మీనాయనగారు.

అవీక్షితుడు

మా నాయనగారా?

వై శా లి ని

అవును.

అ వీ క్షి తు డు

కారణము?

వై శా లి ని

స్పష్టమే. మీరుపట్టుబడితిరని వినగానే వారు విదిశమీదికి దండె
వెడలిరి.

అ వీ క్షి తు డు

అటుతరువాత?

వై శా లి ని

మాతండ్రియు సేనలు సన్నద్ధముచేసి యుద్ధమారంభించెను.

అ వీ క్షి తు డు

ఇంతవరకు జయమేపక్షమున?

వై శా లి ని

మీ జనకుని యపారసైన్యమునెదుట మా సేననిలువగలదా? జయ
మువీదే. కాని మాతండ్రిగారు మిక్కిలి పట్టుదలతో బోరాడు
చున్నారు.

అ వీ క్షి తు డు

అయ్యో! ప్రేమకొరకుగూడ రక్తపాతమగుచున్నదా?

వై శా లి ని

ఇప్పుడే యుద్ధక్షేత్రమునుండి దూతయొకడువచ్చి రక్తపాతము
శీఘ్రముగనే ముగియునని చెప్పినాడు.

అ వీ క్షి తు డు

ఎట్లు?

వై శా లి ని

ఇరువురును సంధిచేసికొందురు.

[నేపథ్యమున వాద్యధ్వనియగుచున్నది.]

అ వీ క్షి తు డు

ఆకస్మికముగా నీధ్వనియేమి?

వై శా లి ని

ఇది సంధివాద్యము. సంధిజరిగియుండవచ్చును.

అ వీ క్షి తు డు

మాతండ్రిగారు యుద్ధక్షేత్రమునుండి తిరిగివచ్చుచున్నారాయేమి?

వై శా లి ని

చూచెదను.

[వైశాలిని తలుపు తెరచి చూచుచున్నది.]

అ వీ క్షి తు డు

[తనలో] వైశాలినీ! వైశాలినీ! నీవులభించుటకు నీవెంతలెంతలు చేసితిని! నీవుదూరమునుండివచ్చుచున్న విపంచీస్వరమువలె మధురముగానుంటివి. నేనుపట్టుకొనుటకు బరుగెత్తితిని. కాళ్లకు దెబ్బలుతగిలినవి. చేతికేమియు జిక్కలేదు. నీవింద్రధనస్సువలె మనోహరముగానుంటివి. నిన్నుపరిగ్రహించుటకు బరుగెత్తితిని. నీవు పలాయనముచేసితివి. కఠినప్రయాసపై నీవులభించితివి. నేనో—వ్యర్థుడనైతిని. అయ్యో! వైశాలినీ!

వై శా లి ని

మాతండ్రిగారేకాదు, వారితోగలసి మీతండ్రిగారుగూడ నరుదెంచుచున్నారు.

అ వీ క్షి తు డు

వారిచ్చటికేల వచ్చుచున్నారు? ఈకుపుత్రునిదౌర్బల్యమునుగాంచి నవ్వుటకా? ఈముఖముతో నాయనగారి నెట్లుచూడగలను? నే నేమివీరవిహారముచేసితిని? నన్నెచ్చటనైన దాచిపెట్టగలవా వైశాలినీ!

వై శా లి ని

[కొంచెము యోజించి] ఆ

ఆ వీ క్షి తు డు

ఎచ్చట?

వై శా లి ని

మరెచ్చట? [మెల్లగా] నాహృదయ—[బిగ్గరగా] మందిరము;

ఆ వీ క్షి తు డు

నాకు స్పష్టముగా వినబడలేదు. ఏమందిరమున?

వై శా లి ని

మరెక్కడను కాదు. [చిరునవ్వు నవ్వి లజ్జనభినయించుచున్నది.]

ఆ వీ క్షి తు డు

వైశాలినీ! సిగ్గుపడితివా? నిజము చెప్పుచున్నాను. నేడు నీయీ భావము నాకునచ్చుటలేదు. వెనుకటివలె మరలనన్నొకసారి ద్వేషింపుము. ఇప్పుడు నన్ను ద్వేషింతువేని, భావికాలమున నాకు శాంతి లభించును.

వై శా లి ని

మిమ్ము ద్వేషింతునా?

ఆ వీ క్షి తు డు

నన్ను ద్వేషింపుము. నాదర్శనమును, నాస్పర్శమును, నాఛాయను ద్వేషింపుము.

వై శా లి ని

కాదు, మిమ్ము ప్రేమింతును. ఈజన్మముననేగాక జన్మాంతరముల గూడ మిమ్ము ప్రేమింతును. జాగ్రత్స్వప్నసుషుప్తులందును మిమ్మే ప్రేమింతును. నాప్రేమ మంతమయినయెడల బతంగదీపములనుండి యప్పుదీసికొందును. మేఘ మయూరములను యాచించెదను. వసంత కోకిలల యనురాగమునపహరింతును. మురళీహారిణముల ప్రేమనుబలాత్కారముగా దీసికొందును—అప్పుడు గూడ మిమ్మే ప్రేమింతును!

అవీక్షితుడు

[అదరిపడి శయ్యనుండిలేచి] కాని చాలయాలస్యమయినది. ఇప్పు డిట్లుకాజాలదు వైశాలినీ!

వైశాలిని

[పాదములపై వ్రాలి] ఇట్లేకానిండు నాథా! నేనీ ప్రకారమే చేసి శమునకు గనబరతును. [పట్టుకొని అవీక్షితుని బరుండబెట్టుటకు తవ త్నించుచున్నది.] మీరు దుర్బలముగా నున్నారు. విశ్రమింపుడు.

అవీక్షితుడు

వదలుము, నన్ను తాకకుము. [నేపథ్యమున నెవరిదోపాదధ్వని విని వైశాలిని సిగ్గుపడి వెనుకకు జరిగిపోవుచున్నది.] పూర్వపశ్చిమ దిశలు కలియజాలనట్లు మన మిరువురము కలియజాలము. చంద్రుడు చేతి కెంతదూరముగ నున్నాడో నీవుగూడ నంతే దూరముగా నున్నావు.

[తటాలున కరంధముడు విశాలుడు ప్రవేశించుచున్నారు.]

విశాలుడు

కాదుకాదు. చంద్రునకు వెన్నెలకును నెంత సమీప్యమున్నదో మీరిరువురకును నంత సమీప్య మున్నది.

కరంధముడు

చంద్రమౌళీశ్వరునకు చంద్రానన యగు సతీదేవి యెంత సమీప మునన్నదో యంత సమీపమున మీ రిరువురు నున్నారు.

అవీక్షితుడు

ఎవరు? నాయనాగారా!

[వైశాలిని విశాలునకును, అవీక్షితుడు కరంధమునకును బ్రణ మిల్లుచున్నారు.]

కరంధముడు

వత్సా, లెమ్ము, వైశాలిని నీయదియే.

విశాలుడు

నేను వీరిని జూచి కృతార్థుడ నగుదును. రాజకుమారా! వైశాలిని పాణిగ్రహణము చేయుము.

[విశాలుడు, కరంధము, డిరువురి హస్తములను గలుప యత్నించు చున్నారు.]

అవీక్షితుడు

ఇది మహాశుభముహూర్తము. కాని—

కరంధముడు

ఇట్టి వేళగూడ 'కాని' యనుచున్నావా? మీదాంపత్య మయుక్తమని యెవరన సాహసింతురు?

అవీక్షితుడు

నే ననగలను. నేను వైశాలినికి దగను.

విశాలుడు

ఎందుకు?

అవీక్షితుడు

ఎందుకా—నేను పిరికిపందను. యుద్ధమందు బరాజితుడనైన మీ బందీని. [కరంధమునితో] జనకా, నేను కుపుత్రుడను. మీయశఃపటమునకు గళంకము నాపాదించితిని. వైశాలినికి నేనయోగ్యుడను.

[విశాలు డులికిపడుచున్నాడు. వైశాలిని వణకు చున్నది.]

కరంధముడు

కాని, నీ విప్పుడు దాసుడవు కావు. సంధినియమముల ప్రకారము వైశాలినికిని నీకును వివాహమహోత్సవము జరుగును.

అవీక్షితుడు

వలదు. జనకా, నాదిట్టతనము క్షమింపుడు. నేను వీరకులకళంకుడను, ఆడుదానను! స్త్రీ స్త్రీని బరిణయమాడునా? తొలుదొల్త వైశాలినిని బరిగ్రహించుటకై నేజేసిన ప్రతిజ్ఞ జన్మాంతమువరకు బ్రహ్మ

చర్యము నడుపుటకై నేడు పర్యవసన్నమైనది. నాభీరుత్వమునకిది ప్రాయశ్చిత్తము. పరమేశ్వరుడు నాకు స్థైర్యమొసగుగాక! నాయనగారు నన్నాశీర్వదింతురుగాక!

[అవీక్షితుడు కరంధముని పాదములమీద నాశీర్వాదము పొందుకు వాలుచున్నాడు. వైశాలిని మూర్ఛితయై నేలపై బడినది. కరంము డాశ్చర్య పడుచున్నాడు. విశాలుడు చింతితు డగుచున్నాడు.]

తెర పడుచున్నది.

## ద్వి తీ యాం క ము

*

### మొ ద టి రం గ ము

గదిలో

రాత్రి—ఒంటరిగ వైశాలిని

సమీపమున దీపము వెలుగుచున్నది.

వై శా లి ని

నన్ను ప్రేమించినపుడు వారిననాదరించితిని. నేను ప్రేమించినపుడు వారు నన్ననాదరించి వెడలిపోయిరి. అయ్యో! మే మన్యోన్యము ద్వేషించుటయే సంభవించిన, నొక్కసారిగానే యేల యట్లు చేయమైతిమి? ప్రేమించుటయే సంభవించిననొకేసారిగా నేల ప్రేమించమైతిమి? అపేక్షితా! అపేక్షితా! ఏమంటివి? ఆజన్మాంతమవివాహితుడనై యుండెదననియా? మరి నేనో?—

[ఇంతలో దాసి ప్రవేశించుచున్నది.]

దా సి

మీకు వివాహము.

వై శా లి ని

భగ్నమనోరథములతోనా? వరు డెంతయందగాడు?

దా సి

విరాటరాజకుమారుడు. నేడే రాజదూత వచ్చినాడు.

వై శా లి ని

నోరుమూసికో. ఉన్మత్తురాలా. ఆర్యకన్యక కెక్కడనైనను ద్వితీయ వివాహమగునా?

దాసి

మీకు వివాహ మెప్పుడైనది?

వైశాలిని

వివాహమనగా నేమో చెప్పు.

దాసి

శాంతినే వివాహమందురు. మనోహరోత్సవములు చూచి చూచి ...ము లలసిపోవును. మంగళగీతములు పాడిపాడి కంఠ మెండిపోవును. ...డసోపేతమైన భోజనములు చేసిచేసి కుక్షియు, దానినువాసన నా ఘ్రాణించి యాఘ్రాణించి నాసికయు నలసిపోవును. ఈశాంతి నడుమ వరుడు వధువు పాణిగ్రహణముచేసినచో వివాహమనిన నర్థము.

వైశాలిని

ఊరకో మూర్ఖురాలా! శాంతిని వివాహమనరు. సర్వస్వము నర్పించుటయే వివాహము. ప్రియతమునకొరకెదురు చూచిచూచి కన్నులు కాయలు గాయును; గుణగానమాకర్ణించి యాకర్ణించి కర్ణములు బధిరీభూతములగును; పవిత్రనామము నుచ్చరించి యుచ్చరించి నాలుక స్తంభించును. అంతయు ప్రియతమమయమనియే భావించుచుండ తన యస్తిత్వము గోల్పోవును. ఈ యస్తిత్వ విస్మరణసమయమున ప్రియతము డేతెంచినచో దాసిని వివాహమందురు, రాకపోయినను వివాహమందురు. నాకిట్లే పెండ్లియయినది. కాని, దౌర్భాగ్యవశమున నేను వితంతువు నయితిని.

దాసి

రాజకుమారీ! ఎంతమాటయనుచున్నారు. మీరు వితంతువులా!

వైశాలిని

కాదుకాదు. ఇట్లనుటచే నాస్వామి కశుభములుగలుగును. నేను వితంతువునుకాను. నాకు భర్తయున్నాడు. దాసీ! నేడునాకలంకారము చేయుము. వసంతనవీనకుసుమములతో నాకు జడవేసి, రత్నఖచిత

కంకణములు తొడిగి, శరీరమునకు కస్తూరీచందనాది సుగంధద్రవ్యములు పూసి, కౌశేయవస్త్రములు ధరింపజేసి, నక్షత్రములనుగూడ సిగ్గుపరచెడి రత్నభూషలు తొడుగుము. నేను నేను ప్రియతముని సందర్శించుట కభిసారయాత్ర చేసెదను. నేను సుందరిని. అవీక్షితుఁడు నన్నొకసారి ప్రేమించెను. స్త్రీజన్మ దాల్చికూడ నేను నా నాథుని మనసు నాకర్షింపలేకపోయినచో, నాజన్మము కాల్పనా? పొమ్ము, నే చెప్పినది శీఘ్రముగా జేయుము.

దా సి

చిత్తము. [వెళ్ళబోవుచున్నది.]

వై శా లి ని

ఆగుము ఈ యౌవనము తిరిగిరాదు. వయస్సు వ్యర్థముగా బోదుగదా? నా ప్రయాసమంతయు నిష్ఫలము కాదుగదా?

దా సి

మీరే దీనినిగురించి విచారింప నర్హులు.

వై శా లి ని

నమ్మకములేదు. వారు కఠినహృదయులు. వారు కోమలపుష్పమునుగోసి నలిపివైచిరి. పుష్పమున కిట్టి దుర్దశ నాపాదింపదలపెట్టియున్నచో, దాని నావృక్షమందే యేల వాడిపోనీయలేరు? పురుషులు కఠినులు! నేటికొక మాసముగడచెను. నిత్యము వారికొఱ కెదురు చూచుచున్నాను. వారు నా స్మృతిపథమున మెలగుచున్నారు, కాని పథము వెంబడించి వచ్చుటలేదు. తొలుదొల్త దర్శనమిచ్చిన పుణ్యక్షేత్రమగు నుపవనమందు వారినన్వేషించుచున్నాను. వారిపదాంకము లభించుచున్నవి. కాని వారు లభించుటలేరు. ఇది నా యపరాధమే. అవీక్షితా, మీరు నాకు దొరకినను గోల్పోతిని. "పొండు. మీమీద నాకు ప్రేమ లేద"ని నేనే యంటిని.

దాసి

ఇదేమి? మీరే అవీక్షితరాజకుమారుని ప్రేమను స్వీకరింపలేదా!

వైశాలిని

అవును.

దాసి

మరల మీరే వారికొరకు వ్యాకులపడుచున్నారా?

వైశాలిని

అవును.

దాసి

ఇంతగా మారుట కెంతకాలము పట్టెను?

వైశాలిని

ఒకరోజు.

దాసి

ఒకరోజేనా?

వైశాలిని

నీకు విన కుతూహల మున్నదా? చెప్పెద, వినుము. స్వయంవరమునకు వెనుకటి రోజు సంధ్యాకాలమున నే నుద్యానవనమందు మాలికను గ్రుచ్చుచుంటిని. ఆకస్మికముగా అవీక్షితుడు వచ్చి "రేపటి స్వయంవరమున నన్ను వరించవలెన"ని చెప్పెను.

దాసి

మీ రేమంటిరి?

వైశాలిని

అయ్యో, నేనే చెప్పితిని. నేనే నాకంఠమున కురి దెచ్చుకొంటిని. నేను నానాథుని గుర్తింపనైతిని. "పొండు. తొలగిపొండు. నాకసహ్యము" అని చెప్పితిని.

దాసి

ఎందులకు? వారందముగ లేరా?

వై శా లి ని

వారు చక్కని వారే, వీరులే, లోకమున కధీశ్వరులే. సౌందర్య బలప్రభుత్వత్రివేణిక నేనెచ్చటను గాంచనైతిని. అయినను, వారి ననాదరించితిని.

దా సి

వా రవీక్షితులని మీ కప్పుడు తెలియదా?

వై శా లి ని

నాకంతయు దెలియును.

దా సి

అయిన వారిని ద్వేషించుటకు గారణము?

వై శా లి ని

ఏమియు లేదు. వారికి నామీద ప్రేమగలదు. అందులకే ద్వేషించితిని.

దా సి

ఎంతవరకు ద్వేష ముండెను?

వై శా లి ని

స్వల్పకాలము. మగుసటిదినము వారు నన్ను బలాత్కారముగా గొనిపోయిరి. నిర్జనవనప్రదేశమున వారు నన్ను 'ప్రేమింపు'మని కోరిరి. అప్పుడుగూడ నానాథునిగ్రహింపజాలనైతిని. మాటలతో గాని, కార్య రూపమున గాని వారిని దిరస్కరింపక పోయినప్పటికిని, వారు నా ప్రేమరాజ్యమును దాటి రాజాలకుండిరి.

దా సి

పిమ్మట?

వై శా లి ని

అప్పటి నుండియే పరివర్తన మారంభమాయెను. ఏమి చెప్పుదును? నా నేత్రావరణము తొలగిపోయినది. నానాథుడు ఛద్మవేషమును

ద్యజించెను. నేను వారిని గ్రహించితిని. నా జనకుని సైన్యముచే నధర్మయుద్ధమందు బరాజితుడైన అవీక్షితుడు గాయపడి నేలపై బరుండియున్నపుడు, ఆ దృశ్యమును గాంచి నా హృదయము ద్రవీభూతమైనది. అప్పుడు "మీరే నాప్రియతములు. నాకు మీ యెడ గాఢానురాగమున్నద"ని వారితో నంటిని.

దా సి

వారేమనిరి?

వై శా లి ని

అప్పుడేమియు ననలేదు. అటుతరువాతనే వారు మూర్ఛితులైరి. కొన్ని రోజులు గడచిన పిమ్మట "పరాజితుడు బందియగువాడు రాజకుమారి ప్రాణనాధుడు కాజాలడ"నిరి.

దా సి

స్త్రీ సౌందర్యమున కెట్టి పరాభవము వాటిల్లినది! అవీక్షితుడు మిమ్ము బరిత్యజించెనా?

వై శా లి ని

అవును. వృక్ష మెండుటాకును ద్యజించినట్లే.

దా సి

మరల సమ్మేళనమగు నవకాశ లేదా?

వై శా లి ని

వృక్ష మెండుటాకును విడిచి క్రొత్తయాకులు తొడుగుచున్నది. వృక్షమునుండి రాలిన యాకు తరుమూలమున ధూళిలో గలిసిపోవుచున్నది. మాయిరువురి సమ్మేళనము గూడ నట్లేయగును.

దా సి

అవీక్షితుడు మిమ్ము ద్యజించినపుడు వాకుకు హృదయపూర్వకముగ వెలువడినదేనా? ఎన్నడైనను మీరిరువురు నొకటి యగుటకు బంధమేమియు లేదా?

వైశాలిని

ఆ యాశలేదు, స్వప్నమందును లేదు అనురాగశూన్యమగు వాక్కులతో నన్ను నాదరించిరి. గంభీర ముఖమండలమును గాంచినంతనే వారు వృథ ప్రతిజ్ఞావంతులని తోచినది.

దాసి

కాని మనుష్యస్వభావము పరివర్తనశీలమైనది. ప్రేమ ద్వేషము మారెనుకదా! ఒకానొకనాడు ద్వేషము ప్రేమగా మారవచ్చును.

వైశాలిని

వారిస్వభావముమారినను, చేసిన ప్రతిజ్ఞను మరచి వారింకొక రమణిని ప్రేమింతురు, కాని నన్ను మాత్రము ప్రేమింపరు.

దాసి

అట్లయిన మీరేమి నిర్ణయించితిరి?

వైశాలిని

ఇదియే. ఏమన, కమలనేత్రుడగు అవీక్షితుడు పాషాణము కంటెను గఠినుడు! ఈ జన్మమందు వారిని పొందజాలకుంటినేని వారి పాషాణ ప్రతిమను జన్మాంతమువరకు బూజింతును. వారు లభ్యులగుటకు లోకమునకు, సంసారసౌఖ్యమునకు, సమస్తమునకు నీళ్ళు విడుతును.

దాసి

ఎప్పుడు?

వైశాలిని

రేపు కాదు. నేడే. నే నందులకు సంసిద్ధురాలనైతిని.

దాసి

ఎందులకు?

వైశాలిని

ఇటుచూడు. [వైశాలిని పట్టుచీరక్రింద కాషాయవస్త్రము ధరించియుండును. దాసి చూచుచుండగనే వైశాలిని పట్టుచీరెను దీసి వేయును.]

దాసి

ఇదేమి! ఇదేమి! హా! పరమేశ్వరా! విశాలరాజ్యము నెడ నెవరికి గోపముకలిగినది! దేవతలారా! రక్షింపుడు—రాజకుమారీ! సన్యాసిని వేషము ధరించితివేమి?

వైశాలిని

అవును. ఆశ్చర్యపడవలదు. నేను సన్యాసిని నయి అపేక్షితుని బ్రతి దేశమున నన్వేషింతును. పరాగమున వారి పదాంకములను వెదకెదను. లతలను వృక్షములను వారి యింటికి త్రోవచూపుడని యడిగెదను. వారిని గాంచుటకు వనములలో నేకాంతముగా తప మొనరింతును. వారి నామమును జపించుచు జపించుచు నచ్చటనే లీనమగుదును. వారు నావారు. వారిని బొందెదను. వారే నాజీవనమునకు లక్ష్యము. వారి శుశ్రూషయే నాకు ముక్తి.

దాసి

రాజకుమారీ-ఏమనుచున్నారు? ఆవరణలేని యాకాశముక్రింద మీరెట్లుండగలరు? ఈ సుకుమారదేహము ఋతుపరివర్తనము నెట్లు సహింపగలదు? ఘాతుకమృగములతో నెట్లుండగలదు? రాజకుమారి సన్యాసిని యెట్లగును?

వైశాలిని

ఈ చిక్కు నీవు విడదీయ నవసరములేదు. తీసికో, యీనాభూష ణములు తీసికొని ప్రియతముడు కనికరించు దీనుని కెవరికైన నిచ్చి వేయుము.

[వైశాలిని దాసికి దన యాభరణములు తీసి యిచ్చుచున్నది. దాసి వణకుచున్న చేతులతో వానిని దీసికొనుచున్నది.]

దాసి

ఈ మార్గము ననుసరించుట మీ కలవాటు లేదు గదా. ఇది భయంకరయాత్ర.

వై శా లి ని

కాని లక్ష్యము చాల మధురమైనది. ప్రియతముడు లభించుననను నాశ యీ దుఃఖములను దృణప్రాయముగా జూడదా? ప్రియతముడు లభించిన పిమ్మట నీకష్టములు స్వప్నమువలె మధురముగా నుండవా?

దా సి

అయ్యో! ఘోరారణ్యము, కంటకము లెక్కడ? ఈచరణకమలః లెక్కడ?

వై శా లి ని

కంటకములనుండి నన్ను బ్రతికించుటకు నీవే కంటకము గావద్దు. నీవూరక యుండజాలనిచో, నీ వాక్ఛక్తిని కర్ణములందు నిలిపి నా మాట వినుము. తీసికో. ఈతాళపత్రము, నాయనగారికి శీఘ్రముగా నిచ్చివేయుము. ఎంత ప్రొద్దుపోయినదో బయటికి వెళ్ళి చూడు. [దాసి బయటికి బోవును]

వై శా లి ని

నాథా! మీరేమార్గప్రదర్శకులు. మిమ్ము నే యన్వేషింపదలచి తిని. ప్రాణనాథా! ఎచ్చటనుంటిరి; ద్వారమున్ముక్తమైనది. నేను నంసి ద్ధురాలను. నాబాల్యక్రీడాక్షేత్రమా, విశాలదేశమా! ప్రాణనాథుడు లభించినచో మరల నీదర్శన మబ్బును. లభింపనిచో, ఇదియే తుది మ్రొక్కు! జననీ, జననీ, జనకా, జనకా కాదుకాదు. నేను గుండె రాయిచేసికొని వెడలుదును. ఇది రథశబ్దమే. నన్ను గొనిపోవుటకు వచ్చిరి. ఇంత త్వరితముగానా! [వేగముగా వెడలి పోవుచున్నది.]

[దాసి ప్రవేశించుచున్నది.]

దా సి

రాజకుమారీ! ఎచ్చటికి బోయితిరి? రాజకుమారీ!

[విశాలుడు ప్రవేశించును.]

వి శా లు డు

వైశాలిని యెచ్చట నున్నది?

దా సి

నాకు దెలియదు. ఇప్పుడిచ్చటనే యుండెను. ఇది తీసికొనుడు.

వి శా లు డు

ఏమిటి?

దా సి

తాళపత్రము. రాజకుమారి మీ కీయమన్నది.

వి శా లు డు

[తాళపత్రమును దీపము నెదుటికి గొనిపోయి చదువుచున్నాడు]

"మహారాజ చరణకమలములకు నమస్కారము. ఒకానొక శుభ కార్యము ననుష్ఠించుటకు బ్రపంచమును ద్యజించుచున్నాను. మీ యాజ్ఞోల్లంఘనమను పాపమునుండి తప్పించుకొనుటకు వెడలి పోవలసి వచ్చినది. నే నందులకే యిష్టపడితిని. నాశుభము నభిలషింతురేని నన్ను వెదుక బ్రయత్నింపకుడు. కానిచో, నేను విషము పుచ్చుకొని ప్రాణములు—" ఇదేమి! వైశాలిని వెడలిపోయినదా? ఏమార్గమున?

దా సి

నే నెరుగను.

వి శా లు డు

నీవు చిత్తరువువలె నిలుచుంటివా? వైశాలినీ! వైశాలినీ!

[విశాలుడు చింతామగ్నుడై శీఘ్రముగా వెడలిపోవుచున్నాడు. వెనువెంట దాసియు బోవుచున్నది.]

## రెండవ రంగము

## విలాస భవనము

[అవీక్షితుడు వైశాలిని పటమును దదేకదృష్టితో జూచుచున్నాడు

అవీక్షితుడు

ఏమియు దోచుటలేదు. జీవితము లక్ష్యశూన్యమయిపోవు తోచుచున్నది. పృథ్వి శూన్యమయి పోయినది! ప్రాపంచకసుఖ లన్నియు నంతర్ధానమయిపోయినవి. ప్రకృతి యానందగీతిక నాపి క్షి మించుచున్నది. వికచ ప్రసూనరాశి, నవీనజీవనము, మనో హరాభి లాషలతో వసంతు డరుదెంచుచున్నాడు. అతని రాకగోచరించుట లేదు. ఆతని పోకయు దెలియవచ్చుటలేదు. నక్షత్ర ఖచితనీలావగుంఠ నము నెత్తి శరచ్చంద్రుడు తొంగిచూచుచున్నాడు. కాని యాతని కడవిశేషమున్నట్లు కనబడుటలేదు. ప్రావృణ్మేఘమాలికయందు నృత్య శీలయగు చంచలాంగన నావానసము నాహరించుట లేదు. నాకేది యు హృదయంగమముగ లేదు. యావజ్జీవనైశ్వర్యము, యావల్లోక సౌందర్యము నపహరించి యెచ్చటికి బోయితివి? నిన్నెచ్చట నన్వేషిం తును? వైశాలినీ! నీవు సన్యాసిని వైతివని వింటిని. సుఖములు భోగ ములు విలాసములు సర్వమును ద్యజించితివి. మరి నేనో! అయ్యో! నీవు లేకుండగనే సర్వసుఖముల ననుభవించుచున్నాను. నాజీవనము కాల్పనా! ఇదే యామె పటము. దీని వెంట నేను దారుణవ్యథను కూడ గొంటినిగదా! దీనికొరకై సౌఖ్యమునుశాంతినిసమర్పించితినిగదా!నోరు లేనిసౌందర్యము వైశాలినికంటె గూడ నాకు ప్రియతరముగ నున్నది. ఆమెను ప్రేమించుటకు బూర్వము నేను దీనినే కోరియుంటిని. దీని యధరనేత్రములందు వైశాలినికివలె చిరునవ్వును లజ్జయును లేకపోయి నను, ఈ పటనైశ్చల్యము మిక్కిలి యింపుగొలుపుచున్నది. ఈపటము నన్ను తిరస్కరింపనేరదు. చెప్పుము, వైశాలినీ! ఏదైన మాటలా

ము. నిభృత తపోవనమున నెప్పుడైనను నన్ను స్మరింతువా? కోయిల నవీనవసంతుని సంవేశధారిణివైయె నీకడ కరుదెంచునపుడు నేను లేని పాటును స్మరింతువా ? వర్షాంతమున తుదిమేఘుడు వెడలిపోవునపుడు వతనినిసజలనేత్రములతో నుత్కంఠితవై వీక్షింపవా? సుందరీ ! లోకమును బరిత్యజించి వెడలునపుడు, నీ చిహ్నములను గూడ గూహరించి పోవనైతివి? నీవు వెడలిపోవగనే, నాహృదయము నుండి నీస్మృతియు, నాసుషుప్తినుండి నీస్వప్నములు, ఈపటమునుండి నిసౌందర్యము నేల యంతర్ధానముకాలేదు? ప్రియురాలా! ప్రియురాలా! దూరముగనే యుండుము. మన యిరువురినడుమ నా కఠోరప్రతిజ్ఞయు, దైవప్రాతికూల్యము నున్నవిగదా! [పటమును గ్రిందబడవైచి] మనకిక సమ్మేళనము సంఘటిల్లదు. నిన్ను మరచిపో బ్రయత్నింతును. ఎన్నటి కైన మరచి——

[ఆకస్మికముగా నేపథ్యమున గానము వినబడుచున్నది.]

అవీక్షితుడు

ఈ విరహాగీతిక యెంతమధురముగ నున్నది! దిశలయందమృతమును వెదజల్లుచు నెవరు పాడుచున్నారు? రమ్ము, నీ వెవరో నాకడకు వచ్చి యీపాటపాడుము. ఈగీతిక నా కత్యంత హృదయంగముగ నున్నది.

[నటివచ్చి పాడుచున్నది.]

అవీక్షితుడు

ఎవరు? ఎవరు ; వైశాలినియా ?

[నటి యంతరాయముచే నాపివేయును.]

నటి

కాదు స్వామీ !

అ వీ క్షి తు డు

నీవు నీప్రాణనాథు నన్వేషించుచున్నావా?

న టి

కాదు.

అ వీ క్షి తు డు

అటులయిన, నీ జాగరణము, రోదనము, ప్రతీక్షయు నేటికి?

న టి

నా కేమియు దెలియదు.

అ వీ క్షి తు డు

ఈగీతిక ?

న టి

ఒకానొక వృద్ధుడు నేర్పెను. మహారాజుగారి యాజ్ఞానుసారము మీ మనోరంజనముకొరకే గీతిక పాడుచున్నాను.

అ వీ క్షి తు డు

ఈగీతిక వినుట నా కిష్టము లేదు. వినుటచే నాహృదయమున వర్ణనాతీతమగు వ్యథకలుగుచున్నది. నాజ్వాల కిదిపవనమయినది. పొమ్ము, [నటిపోబోవును.] ఆగుము. ఈగీతికను బూర్ణముగా బాడి పొమ్ము. చివరకు ప్రాణనాథుడు లభించెనో లేదో తెలిసికొనవలెను.

న టి

అపీక్షితుడు

అదేమి? ప్రాణనాథుడు లభింపలేదా? వియోగము, రోదనము, పతీక్ష, జాగరణము-దీనినే ప్రేమయందురు. ఎన్నడు లభింపనివాడే ప్రాణనాథుడా? మరీచికను వెంబడించెడివాడే కాముకుడా? నేను మోసపోను. ఆమె సవశ్యము మరచిపోదును. ఆమె యాశాజాలమున చిక్కుకొనను. ఆమృగాక్షి మృగతృష్ణను విశ్వసింపను. ఆను కేశాపాశ ములబడను. నటీ, నీ వింతవరకు నాకడనే యున్నావా? పొమ్ము. వీలయినచో ఈగీతికను బూర్తిగా పురచిపొమ్ము. నేటినుండి యిట్టి గీతములుపాడి నా సుప్తస్మృతిని మేలుకొల్ప సాహసింపకుము.

నటి

చిత్తము. [పోబోవుచున్నది.]

అపీక్షితుడు

ఆగుము. నే నవీక్షితుడను. రాజ్యమునకు భావిప్రభువును. దీనుల కష్టములబాపుట నాకర్తవ్యము. నే నీవిధముగ నహర్నిశములు ప్రేమ మగ్నుడనై యుండుట బాగుగ లేదు. నాశక్తులను విరహాగ్ని కాహుతి జేయుట యుక్తముగాదు. నేను స్వశక్తిని సద్వినియోగము చేసెదను. శస్త్రాగారములందుండి యుండిన వింటిత్రాడు నెలుకలు కొట్టివేయు చున్నవి. బాణములు జీర్ణములగుచున్నవి. ఖడ్గములు తుప్పుపట్టు చున్నవి. నేడు నేను వేటాడుట కేగెదను. నా బాహుబలము గోల్పోవ లేదుగదాయని చింతిల్లుచున్నాను. రథమాయత్తము చేయుమని సారథి కెఱింగింపుము.

[నటి వెడలిపోవును.]

[మూకదృశ్యము. వాద్యములు మ్రోగుచున్నవి. అవీక్షితుడు కవచాదులను తొడిగికొని ధనుర్బాణములు ధరించినాడు. అతడు సంసిద్ధుడగునప్పటికి సారథి ప్రవేశించుచున్నాడు.]

సా ర ధి

రథము సజ్జీకృతమైనది ప్రభూ !

అ వీ క్షి తు డు

నేనుగూడ సంసిద్ధుడను. పోదము.

[ఇరువురు వెడలిపోవుచున్నారు.]

తె ర ప డు చు న్న ది.

## తృతీయాంకము

*

### మొదటిరంగము

### ఆశ్రమము

[న్యాసిని వైశాలిని యొక్క శిలాఖండముపై గూరుచుండిపాడును.]

చేరవచ్చునట జీవితేశ్వరుడు !
మన్మాథుం డెటో మరలి చనడుగద !
చనివేగిరమే, సంపూర్ణంబుగ
చేసికొందునే శృంగారంబును.
త్యజించి చింతను ధైర్యముదాలిచి
అరరమూ దెరచెద అల్లి కీల్జడకు
గ్రుచ్చవలయునే కుసుమమాలికను.
చేరవచ్చునట జీవితేశ్వరుడు ?
మన్మాథుం డెటో మరలి చనడుగద !

కాని అయ్యో! ప్రాణనాథు డరుగుదెంచునని యెవరు చెప్పెదురు? [అప్పుడే ఆమ్రవృక్షముమీాది కోయిల కూయును.] ఎవరు ! కోయిలయా ! ప్రాణనాథు డరుదెంచునని నీవు చెప్పుచున్నావా ? అసత్యమాడుచున్నావు. ఇది నీభ్రమయే. ఎప్పుడైనను నీవు ప్రేమించియుండినచో, ప్రతీక్షనఫలము కాదని తెలిసియుండెడిదే. అనురాగము సంయోగముతో నారంభించును. వియోగముతో నంతమొందును. కాని నీవు ప్రేమించితివి. నీవు కలకూజితములు చేయగనే, నీప్రియతముడగు వసంతుడు కిసలయకలికాకుసుమములతో నీకడ కరుదెంచును. సఖీ ! కేకలిడినచో ప్రాణనాథు డరుదెంచునేని నేను సమస్తస్వరములనేకీభవింపజేసి యేకగ్రీవముగ మూాకత్వము ప్రాప్తించువరకును కేక

లిడుచుందును. కాని వారు పత్తురని యెవరందురు? జీవజంతువు లెవ్వియు ప్రాణనాథునికడనుండి సందేశ మేదియును నాకు గొనివచ్చుట లేదు. వారు నన్ను మోసగించిరి. వారు రారు. నాథా! నేను చేసిన యవమానమునకు బగదీర్చుకొనుచున్నారా? భిక్షుకురాలు, అబలయునై శాలిని మీ ప్రతీకారమును సహింపజాలదు. నే నిటులనే కూర్చుండి యుందును. పరమేశ్వరుని కృపవలన నాపాదములు వేరులై భూలోనికి దిగిపోవును. నా వియోగాశ్రువు లీమూలమును బోషింపగలగును. అది యంకురించిన పిదప, నా రోమరోమము దాని శాఖాపత్రములుగ మారును. మధుమాసము నా ప్రేమను వికసింపజేసి పుష్పరూప మిచ్చుగాక! ఎప్పుడైనను నా ప్రాణనాథు డెండలో నలసిపోయి నాకడ కేతెంచినచో నేను వారికి నీడనిత్తును. ఎండినపిదప శిశిరర్తువున దీర్ఘ శీతల నిశ్వాసముయమున బ్రజ్వరిల్లి వారికి సుష్ణ మొసగినా జీవనము ధన్యము చేసికొందును. [మురల కోయిల కూయుచున్నది.] ఊరుకో కోయిలా! నీ మధురాలాపము నాకొరకుగాదు. పుష్పములారా! నా యాశ్రమసమీపమున వికసింపకుడు. నాలో బ్రచండతాప మున్నది; దానిచే మీరు వాడిపోదురు. లతలారా! మీరు నాకడ వృక్షముల నాలింగనము చేసికొనకుడు. నాహృదయమున గంటకములు గ్రుచ్చుకొని బాధపెట్టుచున్నవి!

[నేపథ్యమున గానము]

౧

నీ శరీరమ్ము ధూళితో నిండిపోయె
వదనము పథశ్రమమ్మున వాడిపోయె
తరణి యస్తాచలమ్మును దరిసినాడు
ఎచ్చటికి మందగతితోడ నేగెదోయి,
తెల్పు మియ్యెడ నూత్నవై దేశికుండ!

౨

వివిధ కంటకపశుసమన్వితము పథము
హస్తముల్ రిక్తముల్ నగ్నమంఘ్రియుగము
సదనమెంతయు దూర, మాసన్నమయ్యె
రజని, జైవాతృకుండంబరమున, గ్రింద
దీపమును లేవు నూత్న వైదేశికుండ!

వైశాలిని

వనమార్గమునుండి గంధర్వులెవరో పాడుకొనుచు బోవుచున్నారు గాబోలును. ఈసమయమున నీగీతము నామనస్సు నాకర్షించినది. మధ్యాహ్నసమయమున సూర్యతాపసంతప్తుడైన వానికి వృక్షచ్ఛాయ లభించినచో, నెంత యానందముకలుగునో, యటులనే విరహసంతప్తరాలనైన నా కిది యమృతధారయే.

[పాట పూర్వమువలె వినబడుచున్నది.]

౩

నిభృతమన్నిలయమ్ము లోనికిని రమ్ము!
నన్ను ధన్యనుజేసి మ న్మందిరమ్ము
బావనము చేయుమోయి! నాపలుకు వినుము
ఓయి నూతన వైదేశికా, యిచటనె
గడపు మీ రేయి, యెట కరుగంగవలదు!

[క్రమక్రమముగ గానమంతరిక్షమునవిలీనమగుచున్నది. వైశాలిని వినుచు వినుచు శిలాఖండముపై నిద్రించును. నిద్రించుచుండగా స్వప్నమగుపడుచున్నది. సశబ్దముగా రంగము మారుచున్నది.]

---

మొదటియుపరంగము

[స్వప్నమున అవీక్షితుడు ప్రవేశించుచున్నాడు. వెనువెంటవైశాలినీ

రాజకుమారి ప్రవేశించుచున్నది.]

వై శా లి ని

నన్ను పరిత్యజింపకుడు నాథా!

అ వీ క్షి తు డు

[ఉలికిపడి] నీవెవరు?

వై శా లి ని

మీ ప్రాణేశ్వరి! [అవీక్షితుని హస్తము బట్టుకొనును.]

అ వీ క్షి తు డు

[చేయి విదిపి] దూరముగ బొమ్ము. పరస్త్రీస్పర్శ పాపము.

వై శా లి ని

నేను పరస్త్రీనా! ఇంతకఠినులు కావద్దు నాథా! ఈ నాక్షీణవదనమును గాంచి నన్ను గుర్తింపజాలరైతిరా? కాని యిట్టి యవస్థ నాకు మీ వియోగమువలననే సంభవించినది. నేను మీ పాణిగ్రహీతను.

అ వీ క్షి తు డు

నీవు మాయావినివి. నిజముగా నీశ్రమవ్యర్థమగును. అవీక్షితుడు జితేంద్రియుడు.

వై శా లి ని

ఏమనుచున్నారు నాథా! మీకొఱకు నేను రాజప్రాసాదమును ద్యజించితిని. మిము లభింతురను నాశతో ప్రపంచసౌఖ్యముల నన్నిటిని పరిత్యజించి వనవాసిని నయితిని.

[అవీక్షితుని హస్తము గ్రహింపగోరుచున్నది.]

అ వీ క్షి తు డు

దూరముగా బో!

వై శా లి ని

ఎంతో తపస్సుచేసినపిమ్మట నేను మిము లభించితిని. ప్రాణముల నైనను గోల్పోదునుగాని మిమ్ము నుమాత్రము విడువజాలను! [హస్తము గ్రహించుచున్నది.]

అవీక్షితుడు

దూరముగా బొమ్ము దౌర్భాగ్యురాలా! [చేయివిదలించి వెడలి పోవుచున్నాడు.]

వైశాలిని

నిర్దయుడా! కఠినుడా! [ఏడ్చుచుబోవుచున్నది.]

[నిద్రించుచున్న వైశాలిని నిట్టూర్పువిడిచి మరియొక ప్రక్కకు తిరుగుచున్నది. మరల స్వప్నముగాంచును. సశబ్దముగా రంగము మారుచున్నది.]

---

రెండవ యుపరంగము

వైశాలిని యుపవనము.

[అవీక్షితుడు కుపితుడై ప్రవేశించుచున్నాడు.]

అవీక్షితుడు

ఎంత సాహసికురాలవు వైశాలినీ!

[పశ్చాత్తాపపడుచు వైశాలిని ప్రవేశించును.]

వైశాలిని

అప్పటి గర్వమణగిపోయినది క్షమింపుమునాథా! [పాదములపై ప్రాలును.]

అవీక్షితుడు

క్షమాపణయా! వలదు "అవీక్షితా! పొండు పొండు. నేను మిమ్మును ద్వేషించుచున్నాన" నెడి నీయవమానవాక్కులు నాకర్ణము లందు ప్రతిధ్వనించుచుండువరకు క్షమింపజాలను. భుజంగినీదంశమున కోర్చి జీవితుడనై యున్నాను. ఎంతటిపరాభవము! అవీక్షితుని కెంతటి పరాభవము వాటిల్లినది! దౌర్భాగ్యురాలా! నీవీలోకమున నెట్లుసుఖింతువో చూచెదను!

వై శా లి ని

క్షమింపుడునాథా! వైశాలిని మిమ్ములను ద్వేషించునా! ఆమె యట్టిపనిచేయజాలదు. ప్రాణేశ్వరుని ద్వేషించునా! ఈజన్మమందు ద చేయదు, జన్మాంతరమందునల్లుచేయదు.

అ వీ క్షి తు డు

కాని, చాలజాగయినది వైశాలినీ! ఏతత్త్వము నాహృదయమ నీప్రేమరూపమునమండెనో, యది సంపూర్ణముగ మారిపోయినది.

వై శా లి ని

కసిదీర్చుకొనుము. అందులకుగూడ సంసిద్ధురాలను. మీ కేమి కోరి ననుసరే, దానిని నిర్వహించుటయే నావరమసౌభాగ్యము. మీప్రతీ కారాగ్ని నారక్తమువలన చల్లారిపోవుచో, నాథా! నన్ను ఖండింపుడు. ఇంతకంటె శ్రేష్ఠతరమగు మరణము నాకులభించునా?

అ వీ క్షి తు డు

నిన్ను ఖండింపను. ప్రళయమువరకు నీవుజీవింపవలెనని నాయభి లాష. అందుచే నేను ప్రతిదినము నూత్న నూత్నముగా గసితీర్చుకొన గలుగుదును. అప్పటికైనను నాకు సంతృప్తిగలుగునా? అప్పటికైనను నీవుచేసిన యవమానము మరవగలుగుదునా?

[అవీక్షితుడు వెనువెంట వైశాలినియు బోవుచున్నారు]

[నిద్రించుచున్న వైశాలిని మరియొక ప్రక్కకు బొరలి నిట్టూర్పు విడుచుచున్నది. మరల స్వప్నము గాంచుచు. సశబ్దముగా రంగము మారుచున్నది.]

---

## మూడవ యుపరంగము

### వనప్రదేశము

[ప్రథమాంకమందలి మూడవరంగము గానబడును.]

### మూకదృశ్యము

[రథోపవిష్టులై వైశాలిని అవీక్షితుడు ప్రవేశించుచున్నారు. అవీక్షితుడు రథము దిగుచున్నాడు. వైశాలినియు నేదో యాలోచించుచు దిగుచున్నది. అవీక్షితుడు 'ప్రేమింపు' మని యాచించు చున్నాడు. వైశాలిని తిరస్కరించుచున్నది. అవీక్షితు డామె హస్తము గ్రహింపు చున్నాడు. వైశాలిని కత్తిదూసి యాత్మహత్య చేసుకొనబోవు చున్నది. అక్కడ స్వప్నలోకమందు అవీక్షితు డామె చెయ్యి పట్టుకొనుచున్నాడు. ఇక్కడ వాస్తవముగ నొక రాక్షసుడు వచ్చి వైశాలిని హస్తము గ్రహించుచున్నాడు. ఉపరంగములు ముగిసినవి.]

రాక్షసుడు

ఈ నిర్జనకాననమం దీసుందరి యెవరు! వనదేవి విశ్రమించుచున్నదా? లేక వసంతశ్రీ యలసి నిద్రించుచున్నదా? కానిచో నాకాశమునుండి, పూర్ణచంద్రుడు స్థానభ్రష్టుడై పృథ్విపై రాలినాడా? ప్రియురాలా! లెమ్ము. నీ వెవరు? మానవాంగనవా, దేవతావనితవా?

[వైశాలిని మేలుకొనుచున్నది.]

వైశాలిని

[అదరిపడి] ఎవరు? ఎవరు? (రాక్షసునిజూచి) రక్షింపుడు! రక్షింపుడు!

[వైశాలిని పారిపోవుచున్నది. రాక్షసుడు వెంబడించుచున్నాడు.]

---

రెండవ రంగము

వనమార్గము.

[వేటాడుచు అవీక్షితుడు వచ్చుచున్నాడు.]

అవీక్షితుడు

ఈ ప్రదేశప్రకృతి యేదో వింతగ గాన్పట్టుచున్నది. పశువుల పక్షులు, వృక్షములు, లతలు, అన్నియును నవీనములుగా గాన్పించు చున్నవి. ఇవియన్నియు నేను రాజధానినుండి కడుదూరము వచ్చితినని సూచించుచున్నవి. అవయవము లన్నియు సడలినవి. మృగము చిక్క నందున నాకు చాలవిచారము గలుగుచున్నది. ఇక ముందునకు బో జాలను. ఈప్రదేశము మిక్కిలి రమణీయముగ నున్న దెందులకో! సారథి వచ్చువరకు నిచ్చటనే విశ్రమింతును.

[అవీక్షితుడు భుజముమీది తూణీరముతీసి నేలపై బెట్టబోవు చున్నాడు. అప్పుడే తటాలున నొకానొకమృగ మొకవైపునుండి పరుగిడుచు వచ్చును. అవీక్షితుడు వెంటనే ధనుర్బాణముల నెత్తి దానివెంట నంటనున్నాడు. ఆకస్మికముగా మరియొకవైపునుండి రక్షింపుడు! రక్షింపుడను ధ్వని వినబడును.]

అవీక్షితుడు

[ఆగి] ఇదియేమి? ఈ ఆర్తనాద మెవరో రమణిది. ఒకవంక మృగము, మరియొకవంక మృగాక్షి! ఏమిచేయుదును? దీనిని వధింతునా లేక యామెను రక్షింతునా? క్షాత్రధర్మమెద్ది? వధించుటకంటె రక్షించుటయే యుత్తమము. నే నటేపోవుదును. ఇది యెవరి మానాను రోధమో, ఎవరి యదృశ్యసంకేతమో తెలియదు.

[మరల "రక్షింపుడు రక్షింపుడు. అబలను రక్షింపుడ" నెడి మాటలు వినబడుచున్నవి.]

అపీక్షితుడు

అమ్మా భయపడకు. ఇదే వచ్చుచున్నాను !

[వేగముగా ధనుర్బాణములు గొని వెడలిపోవుచున్నాడు.]

---

మూడవ రంగము

నిబిడారణ్యము. పర్వతముక్రింద నది ప్రవహించును.

[రాక్షసుడు వైశాలినిని బట్టదలచి వెంబడించుచున్నాడు. వైశాలిని క్షణార్ధము పారిపోవుచున్నది.]

వైశాలిని

రక్షింపుడు, రక్షింపుడు !

రాక్షసుడు

నేను నీ శత్రువునుగానుగదా. మరియేల 'రక్షింపుడ'ని యరచు చుంటివి ?

వైశాలిని

జాగ్రత్త ! నీవు నాసమీపమున కరుదెంచినచో క్రింద ప్రవహించు చున్న నదిలో దుమికి ప్రాణములు విడుతును.

రాక్షసుడు

ఆత్మహత్య పాపము.

వైశాలిని

నీకు బాగుగా ధర్మము తెలియును. పరస్త్రీని గన్నెత్తి చూచుట పాపమనెడి ధర్మముగూడ నేల నేర్చుకొనవైతివి ?

రాక్షసుడు

నీవు పరస్త్రీవని యెవరు చెప్పగలరు? నీకు భర్తయుండినచో, నీవిధముగ వనమందొంటరిగ గ్రుమ్మరుచుందువా? ఇంద్రపదవి లభించినను నీసౌందర్యప్రతిమ నెవరును బరిత్యజింపజాలరు. ఈజీవితమును—విశేషించి యౌవనమును—వ్యర్థపుచ్చకు. ఆత్మహత్య చేసికొనవద్దు.

వై శా లి ని

చేసికొనను. మూర్తీభవించిన పాపమవగు నీ ధర్మోపదేశమునవశ్యము శిరసావహింతును. కాని నీయాశాపిశాచముకొరకు నాప్రాణములు నిలువనీయను !

రా క్ష సు డు

ఇదెటు సంభవించును ?

వై శా లి ని

బాగుగనే. నీ స్పర్శమునుండి తప్పించుకొనుట కీవృక్షాగమందున్న నిశాఖ నారోహింతును. నా భారమునవలన నది విరుగును. దానితో గలసి నేను గూడ నీ తరంగిణియందు బడిపోదును.

రా క్ష సు డు

నే నిక్కడనే నిలుచుండి నీయనురాగమును జయింతును.

వై శా లి ని

అటులయిన దీర్ఘోపవాసమువలన ప్రాణములు గోల్పోవుదును. జాగ్రత్త ! నీవొక్కయడుగు ముందునకు జరుగుట, మృత్యుదేవతగూడ నొకయడుగు నాసమీపమునకు వచ్చుటయే యగును.

[వైశాలిని చెట్టెక్క గోరుచున్నది.]

రా క్ష సు డు

ప్రియే ! ప్రియే ! [పరుగెత్తి వైశాలిని కొంగుపట్టుకొనుచున్నాడు.] రమ్ము రమ్ము, నన్నాలింగనము చేసికొనుము !

అ వీ క్షి తు డు

[నేపథ్యమునుండి] ఇది ని న్నాలింగనము చేసికొనును.

[వెంటనే యొకబాణము వచ్చి రాక్షసుని రొమ్మునకు దగులుచున్నది. రాక్షసుడు నేలపైబడి ప్రాణములు విడుచుచున్నాడు. వైశాలిని భయపడి పొదచాటునకు బోవుచున్నది. పరుగెత్తుచు అవీక్షితుడు ప్రవేశించుచున్నాడు.]

అ పీ క్షి తు డు

ఈమె యెవరు? ఎచ్చట దాగుకొనినది? సుందరీ? సుందరీ! నీ వెటకు బోయితివి? నేను చేసిన కార్యము నీ కనుకూలముగ లేదా?

వై శా లి ని

[తనలో] వారే. సందేహము లేదు. నాతపస్సు నేడు సిద్ధించెనా?

అ పీ క్షి తు డు

ప్రత్యుత్తరము రాదేమి? మీ రెవరు? మీరీ లోకవాసినులు కాక యయినచో, నాభాష మీ కవగతము కానిచో, నాసంకేతమును దెలిసికొని, మీ రెవరో సంకేతమువలన దెలుపుదురా? కనబడుము దేవీ!

వై శా లి ని

[తనలో] వలదు. ఇప్పుడే కనబడను. కాని లోపలనుండి పొంగి పొరలి వచ్చుచున్న యభిలాష మెట్లాపగలను?

అ పీ క్షి తు డు

నన్ను చూచి భయపడుచుంటిరేని మీశత్రువునుగానని యెఱుం గుడు. నేను పరపురుషుడనని జంకుచుంటిరేని, చాటుననుండియే మీ రెవరో తెలుపుడు. మాటాడ రేమి? ఆసుందరి నిజముగ వెడలిపోయెనా? యేమి?

వై శా లి ని

[తనలో] ఇక సహింపజాలను. [చాటుననుండి యుచ్చైస్స్వరము తో] మీ రెవరి నన్వేషించుచున్నారు?

అ పీ క్షి తు డు

మిమ్మునే.

వై శా లి ని

నే నెవరు?

ఆవీక్షితుడు

ఏమో, మీరే తెలుపుడు.

వైశాలిని

వనవాసిని.

ఆవీక్షితుడు

మీవాక్కెంతమధురము, ఎంతకోమలము, నేను స్త్రీలతో
షింపనని ప్రతిన పట్టియున్నప్పటికిని మీ యాకర్షణశక్తిచే నా
సడలిపోయినది. సమీపమునకు రండు.

వైశాలిని

[గొణుగుకొనుచు] కాదుకాదు.

ఆవీక్షితుడు

రాక్షసుని మృత్యువునలన మీకు సంతోషము కలుగలేదా?

వైశాలిని

కలుగలేదని యెట్లు చెప్పగలను? మీరు నాధర్మమును గాపాడితిరి.
మీ కేమి బహుమానము—[కంఠావరోధము.]

ఆవీక్షితుడు

మరల సిగ్గా? అటులయినచో చాటునుండియే యమృతము గురి
పింపుడు. నానేత్రములకు నీ దివ్యదర్శనముబ్బు సౌభాగ్యము లేకున్నను,
నాకర్ణములైనను ఆపుణ్యము చేసికొనును.

వైశాలిని

[తనలో] ఇంతవరకును నన్ను గుర్తింపలేదు. గుర్తించియున్న
సమయమున నన్నాదరించిరి. నేడీ భిక్షుకురా యనురాగమునకు
బ్రతిఫలమేమిత్తురు? పొండు పొండు. నా కేమియు నవసరములేదు.
మిమ్ము స్మరించుచు జీవించియుందును.

ఆవీక్షితుడు.

సుందరీ! ఊరకుంటివేల?

వై శా లి ని

అవును.

అ వీ క్షి తు డు

ఏమి?

వై శా లి ని

మిచెప్పుదునాయని యాలోచించుచున్నాను.

అ వీ క్షి తు డు

నేను నీకు దెలియబరతును. చెప్పుము. ప్రపంచమును బరిత్యజించి నారణ్యము నేల శరణుజొచ్చితివి? భోగవిలాసములు వదలి వనవాసిని వేలనైతివి?

వై శా లి ని

ఇచ్ఛానుసారముగ గాదు.

అ వీ క్షి తు డు

మ రేలనైతివి?

వై శా లి ని

ఇతరుల కోరికవలన. పురుష కాఠిన్యము న న్నిచ్చటి కంపినది.

అ వీ క్షి తు డు

పురుషకాఠిన్యమా? అంత పాపాత్ముడెవడు? వాడేమి చేసెను?

వై శా లి ని

వారు నన్ను పరిత్యజించిరి.

అ వీ క్షి తు డు

అతనిపేరు తెలుపుము. నే నతనికి దండన విధించెదను. నాహస్తములందు ధనుర్బాణములే కాకుండ న్యాయదండము గూడగలదు. నే నవీక్షితరాజకుమారుడను.

వై శా లి ని

వారు గూడ అవీక్షిత రాజకుమారులే.

అ వీ క్షి తు డు

ఎవరు! ఎవరు! వైశాలినియా!

వైశాలిని

అవును. వైశాలినినే.

అవీక్షితుడు

సమీపమునకు రమ్ము.

వైశాలిని

ఎందులకు ?

అవీక్షితుడు

నీకు న్యాయముచేయుదును. నిన్ను దయాహీనుడై పరిత్యజి అవీక్షితుని దండింతును.

వైశాలిని

ఎట్టిదండన నిర్ణయింతురు ?

అవీక్షితుడు

నీ బాహుపాశములందు జన్మాంతము వరకు వాడు బందియై యుండును.

వైశాలిని

ఏమి వినుచున్నాను! నాచెవులకు చెవుడు రాదుగదా ?

అవీక్షితుడు

వైశాలినీ! ప్రియే! ప్రాణేశ్వరీ! రమ్ము రమ్ము. ఇంక నిన్ను ప్రేమింతును!

వైశాలిని

వలదు వలదు. నాకు స్వప్నమిష్టములేదు. [కొంచెమాగి] కాని వాస్తవముగ మీరు నన్ను పరిగ్రహింతురా ?

అవీక్షితుడు

అవును అవును. నిస్సందేహముగ. నేడు నిన్ను జయించితిని. ఇప్పుడు పరాజితుడనైన అవీక్షితుడనుగాను. నేడీరాక్షసుని సంహరించి వీని బారినుండి నిన్నుగాపాడితిని. రమ్ము రమ్ము. చూడు. వీని వక్షమున నాబాణముచే విజయగాథ యంకితమై యున్నది. ఈ రక్తాక్షరము లెంతయందముగనున్నవి !

వైశాలిని

ఎట్టి శుభవాసరమిది! నేనవశ్యము మీసమీపమునకువత్తును. నా మార్గమునం దేదియైన నాటంకమువచ్చినను దానిని లెక్కింపను. నదీ ర్ఘ్యములను దాటివత్తును. అగ్నిని త్రొక్కి వత్తును. జీవజంతువుల నడచివత్తును. నా చెయ్యిపట్టుకొని యెవ్వరైన "యెచ్చటికిబోవుచు వ"ని యడిగినచో ప్రత్యుత్తరమీయక చేయి యచ్చటనే విదలిం సకొని మీకడకు వత్తును.

అవీక్షితుడు

రమ్మి రమ్మి.

వైశాలిని

వచ్చుచున్నాను వచ్చుచున్నాను. విద్యుద్రథమునెక్కి మనోవేగ మున వచ్చుచున్నాను. ఈజీవితము క్షణికమైనది. శత్రువులు బహు సంఖ్యాకులు.

[వైశాలిని పొదనుండి వెలువడి అవీక్షితునికడకు వచ్చుచున్నది. ఆమెవల్కలము కంటకములకు దగులుకొనుచున్నది. ఆమెకాళ్ళకు దెబ్బలు తగులును. దానినేమియును లెక్కజేయక తూలుచు పడుచు అవీక్షితుని కడకువచ్చుచున్నది. అవీక్షితుడాలింగనము చేసికొనును.]

వైశాలిని

ఇక ప్రళయమైననుసరే!

అవీక్షితుడు

వైశాలినీ!

వైశాలిని

జీవనసర్వస్వమా! మీరు లభించుటకింత కఠోరతపస్సేల?

అవీక్షితుడు

ప్రియే!

వైశాలిని

ఇంతకు ముందొక——

అ వీ క్షి తు డు

ఏమి?

వై శా లి ని

మిక్కిలి జాగరూకతతో గాపాడితిని. అదిగూడ కర్తవ్యము చేం గోరుచున్నది.

అ వీ క్షి తు డు

అదేది?

వై శా లి ని

నావాడిపోయిన వరమాలయే.

[వైశాలిని వాడిపోయిన వరమాలనుదీసి అవీక్షితుని కంఠమున దుంచును. సరిగా నాసమయముననే గాలివీచుటవలన పార్శ్వమున దున్న వకుళవృక్షమునుండి కొన్నిపుష్పములు వారిరువురిపై రాల చున్నవి.]

[తెరపడును.]

సమాప్తము.